# శ్రీ శివార్చనమ్ - కోటప్పకొండచరిత్ర,

( మహాన్యాసం, రుద్రాభిషేకం,
శివపంచాయతనదేవాతార్చనం లఘుపూజ. )



భారతీధార్మిక విజ్ఞాన పరిషత్తు
అశోక్‌నగర్ - గుంటూరు.

ముద్రణ : భారతీధార్మిక విజ్ఞాన పరిషత్తు
ప్రతులు : 4000
బహుధాన్య-మాఘబహుళ త్రయోదశి, శనివారం 13.2.99.

ప్రతులకు :
**బొల్లేపల్లి సత్యనారాయణ**
కార్యదర్శి
భారతీధార్మిక విజ్ఞాన పరిషత్తు
అశోక్‌నగర్ - గుంటూరు.

ముద్రణ :
**మాస్టర్ ప్రింటింగ్ ప్రెస్,**
4-4-96, 2వ లైను, చంద్రమౌళినగర్,
గుంటూరు. ఫోన్ : **357302, 223789**





ఘాట్‌రోడ్ ప్రారంభంలో నూతన గణపతి దేవాలయం



శ్రీశ్రీశ్రీ నృశింహానంద భారతీస్వాముల వారు

భారతి ధార్మిక విజ్ఞానపరిషత్ వ్యవస్థాపకులు



గౌ॥ డా॥ కోడెల శివప్రసాదరావు,

త్రికోటేశ్వర ఆలయజీర్ణోద్ధరణ సంఘ అధ్యక్షులు







ఎన్. టి. రామారావు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి,

సత్యనారాయణ, లలితాంబ దంపతులు 1989



1999 Srungary Peethadhi Pathulu



1999 Kotappa Konda Nandhi



1996 Dheerga Sathara Yagam - 2



కోటప్పకొండ



కోటప్పకొండ



1977 కోటప్పకొండ



1977 కోటప్పకొండ



1978 చండీరుద్రయాగం శ్రీపోతుకూచి శ్రీరామమూర్తిగారు



1977 కోటప్పకొండ రుద్రయాగం



Sri Chakrarchana - 1978



Vedha Sabha - 1976



Rudhara Yagum - 1978



Chandi Yagum









1985 Panditha gopa Deva Sastri

# మా విజ్ఞప్తి

శ్రీ త్రికూటేశ్వర స్వామి (కోటేశ్వరస్వామి) మా యిలువేల్పు. మా జన్మ స్థలము కోటప్పకొండకు అతిసమీపమందలి కమ్మవారి పాలెం, మేము ప్రస్తుతము గుంటూరులో నివసించుచున్నాము. ప్రతిసంవత్సరము తొలిఏకాదశి, కార్తిక మాసము, మహాశివరాత్రి పర్వములకు తప్పక కోటప్పకొండకు వచ్చి స్వామి వారిని దర్శించుట మా సంప్రదాయము. మేము తెనాలి గుంటూరులో నివసించు చున్నందునను, పరిస్థితుల ప్రభావమునను కొన్ని పర్యాయములు మాత్రమే స్వామి దర్శనమునకు వచ్చుట జరుగుచున్నది. ఐనను నాటినుండి ఎడతెగని అవినాభావ సంబంధము కుదురుకొన్నది. ఏదో యొక అనిర్వచనీయమైన అంతుపట్టని అనుభూతితో 1977లో ప్రథమ రుద్రయాగము జరుపు భాగ్యము మాకుకలిగినది. ఆ సంవత్సరమునందే పోలిశెట్టి సీతారామాంజనేయులుగారి ప్రోత్సాహముతో శ్రీశ్రీశ్రీ శృంగేరి భారతీతీర్థ స్వామి వారినికొండపైకి తీసికొనివచ్చు అదృష్టము మాకు లభించినది, వారు కొండపైన తగిన వసతులేర్పరచినచో క్షేత్రము మహోన్నత స్థితికి వచ్చునని ఆశీస్సులతో సూచించినారు. నాటి నుండి ప్రతి సంవత్సరము కార్తిక మాసమందును మరి కొన్ని ముఖ్య పర్వదినములందును అభిషేకార్చన, హోమ, అన్నదానవములు యథాశక్తి నిర్వహించుచున్నాము. 1981లో శ్రీశ్రీశ్రీ నృసింహానంద భారతీస్వామివారు మా శ్రీమతికి పంచదశీమంత్రోపదేశము చేసిరి. 1982లో శ్రీ స్వామివారు మహా మాయా శివా చండీ దేవాలయములో నాకు పంచాక్షరీ మంత్రోపదేశమొసంగినారు. అప్పటినుండి ఈ కొండకు నాకును విడదీయరాని అనుబంధమేర్పడినది. ఇది పూర్వ జన్మ సంస్కార బంధముగా తోచుచున్నది. అనాటి యి. ఓ. గారి ప్రోద్బలముతో నొక అభివృద్ధి సంఘమేర్పడినది. 1983 లో కోడెల శివప్రసాదరావుగారు ఎం. ఏల్. ఏ. అగుటతో 1984 నుండి వారి దృష్టి ఘాట్‌రోడ్డు నిర్మాణముపై నెలకొన్నది. వారి ప్రోత్సాహముతో మేము కూడా దైవికబలమును ఆధారముగా చేసికొని 1986లో ముఖ్యమంత్రిగానున్న ఎన్.టి.రామారావుగారిచే ఘాటు రోడ్‌కు శంకుస్థాపన చేయుట జరిగినది. కొన్ని రోజులు పని సాగి అవాంతర పరిస్థితులవల్ల ఆగిపోవుటయు జరిగినది.

మరల 1992లో నరసరావుపేట, చిలకలూరి పేట ఆ ప్రాంత గ్రామ ప్రజల సహకారముతో వేదపండితులైన వంగర కృష్ణమూర్తి అవధానిగారు, కొట కోటయ్య శాస్త్రిగారు సల్పిన బిల్వార్చన యాగ నిర్వహణ పర్యవేక్షణలో 45 రోజులు కోటి బిల్వార్చన జరిగినది. విశేషముగా అన్నదానము జరిగినది. స్వామివారికి పూర్తి శోభాసంపత్తి చేకూరినట్లు మేము తలంచితిమి. స్వామివారికి ఆనాటి నుండి ఆదాయము గూడా పెరిగినది.

1995లో కోడెల శివప్రసాదరావుగారు విశేషమైన పట్టుదలతోను, నిర్విరామ కృషితోను, మరల ఘాట్‌రోడ్‌ను పూర్తిగా నిర్మించుటకు పూనుకొన్నారు. దానికి రెండు కోట్ల యాభైలక్షలు వెచ్చించుట జరిగినది. అదే రీతిగా 1997లో శివాలయము, నందీశ్వరుడు కొంత శిథిలావస్థ నందుట గమనించి శివప్రసాదుగారిని దీనిని గూడ చక్కచేయమని కోరుకొనుటయు, ఆయన ఎండోమెంటు వారితో సంప్రదించి విశేష కృషి సల్పి ఈనాడు దేవాలయ పునర్నిర్మాణము, రాజగోపురము, అభిషేకమండపమునందు నందీశ్వరుడు, గణపతి, కుమార స్వామి దక్షిణామూర్తి, సంతానకోటీశ్వరుడు మున్నగు ఇంకను ఎన్నో విధములైన నిర్మాణములు, శృంగేరీభారతీ స్వామివారి పూర్ణాశీస్సులతో నిర్వహింపబడుచున్నవి. ఈ సందర్భమున 1999 జనవరి 30 నుండి ఫిబ్రవరి 10 వరకు అనగా మాఘబహుళము తుది వరకు కుంభాభిషేక సంప్రోక్షణ కార్యక్రమము నిర్వహించుట పీఠాధిపతుల ఆధ్వర్యమున జరుపబడుచున్నది.

శ్రీశ్రీశ్రీ నృసింహానంద భారతీస్వామి వారి ఆశీస్సులతో ది. 8-6-95 తేదీన భారతీధార్మిక విజ్ఞాన పరిషత్తును గుంటూరులో స్థాపించిన విషయము ధార్మిక చింతనాతత్పరులకు తెలిసినదే. నిష్కామకర్మతో విశ్వకల్యాణ హేతుక్రియాచరణము ఈ సంస్థ లక్ష్యము. ధార్మిక గ్రంథ ముద్రణ ప్రచారములు, నాలుగు కోట్ల గణపతి, 108 కోట్ల లలితా, 12 కోట్ల విష్ణు సహస్ర నామ పారాయణములు, చండీ మూల మంత్రానుష్ఠానములు, పంచాక్షరీ, అష్టాక్షరి, లక్ష చండీసప్తశతీ పారాయణములు, రుద్రపారాయణములు హోమములు నిర్వహించ వలెనని, మా పరిషత్తు ఆశయము. దీనికనుబంధముగా వృద్ధాశ్రమము స్థాపించి మానవసేవలో జన్మను చరితార్థము చేసికొనవలయునని భావించుచున్నాను. ఆధ్యాత్మిక గ్రంథములను సామాన్యులకు చేరువ చేయు సదాశయముతో మరెన్నో గ్రంథములను త్వరలోనే ముద్రించు

చున్నాము. శ్రీ మహాగణపతి, లలిత, విష్ణు తత్త్వ మాహాత్మ్యములను వివరించు మా గ్రంథాలను పాఠకులకు ఉచితముగా నిచ్చుటకు నిశ్చయించితిమి. శ్రీ మహాగణేశతత్వ వైభవము, భారత తత్వ విమర్శనము, గణపతి స్తోత్రమందారము, ఆయుర్వేద సుభాషిత సాహిత్యము తదితర మహోత్కృష్ట గ్రంథములను ముద్రించి ఆధ్యాత్మిక ధార్మిక సాహిత్య రంగాలకు యథాశక్తి సేవ చేయుచుంటిమి. మా భారతీ ధార్మిక విజ్ఞాన పరిషత్తు ప్రచురించు శివార్చనగ్రంథములో శ్రీ త్రికూటేశ్వర స్వామివారి క్షేత్ర మహిమను ఉడుతాభక్తిగా ప్రచురించుటకు సాహసించితిమి. కేవలము కోటేశ్వరస్వామిపై గల నిర్వ్యాజభక్తితోనే ప్రస్తుతము శివార్చనా గ్రంథ ముద్రణ భారమును వహించితిమి.

ది. 30.1.99 నుండి ది. 10.2.99 బహుధాన్యనామ సంవత్సర మాఘబహుళ దశమి సంప్రోక్షణ, మహాకుంభాభిషేకమునకు 65 మంది ఋత్విక్కులు ఎనమండుగురు స్వాముల వార్లు ఆరుగురు గౌరవమంత్రివర్యులు ఈ కార్యక్రములో పాల్గొనిరి. ప్రథమముగా పాల్గొన్నవారు స్వామి సచ్చిదానంద భారతి వారు - శివగంగ, విద్యానందగిరి స్వామి వారు - ఏర్పేడు, స్వామిని శారదా ప్రియానందగారు - కోటప్పకొండ, శ్రీశ్రీ రత్నానంద స్వామి మహారాజ్ - శ్రీశైలం శుకబ్రహ్మాశ్రమము స్వామి వార్లు విద్యా స్వరూపానందగిరి జనార్ధనానంద స్వామి, నిర్వికల్పానంద స్వామి ఇంకెందరో స్వాములు స్వామివారి వద్దకు వచ్చి ఆశీర్వదించినారు. ఇక్కడ కుంభాభిషేకం వైభవంగా జరిగింది. ఇక ప్రతివార్షికోత్సవంలోను దశమినుండి మహాశివరాత్రివరకు రుద్రాభిషేకం, హోమాలు జరపాలని పెద్దలు, పండితులు స్వాములవారు ఏకగ్రీవంగా నిర్ణయించారు.

ఈ ఉత్సవాలకు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గౌ శ్రీ నారాచంద్ర బాబునాయుడు గారు జీర్ణోద్ధరణ సంఘాధ్యక్షులు పంచాయతీ రాజ్ శాఖా మంత్రి వర్యులు శ్రీకోడెల శివప్రసాదరావుగారు, శ్రీ దామిచర్ల ఆంజనేయులుగారు, దేవాదాయ శాఖ కమీషనర్, శ్రీయస్. యమ్. బాలసుబ్రహ్మణ్యం ఐ. ఏ. యస్. గారు మాజీ ధర్మాదాయశాఖామంత్రివర్యులు శ్రీ సింహాద్రి సత్యనారాయణగారు, సహచర మంత్రివర్యులు, కల్టక్టరు శ్రీ జి. యన్. రావుగారు పాల్గొనిరి.

ఈ దేవస్థానాభివృద్ధికి సహకరించిన నాటి చోళ రాజులనుండి నేటి కోడెల సేవలు అనన్యము. త్రికూటేశ్వర స్వామి దేవాలయ వంశ పారంపర్య ధర్మకర్తలైన శ్రీ రాజామల్రాజు విజయకృష్ణ గుండా రావుగారికిని, జీర్ణోద్ధరణ కమిటీ సభ్యులకు దేవస్థానాభివృద్ధికై సకాలమున ఆర్థిక సహకారమందించిన దేవాదాయ శాఖ వారికిని 1976 నుండి నేటి వరకు మా భారతీ ధార్మిక విజ్ఞాన పరిషత్తు ద్వారా నిర్వహించు చున్న రుద్ర, చండీ, గణపతి యాగములకు సహకారములు చేకూర్చిన ఋత్విగ్గణమునకును, జీర్ణోద్ధరణాది కార్యక్రమములకు ఆచార్య బ్రహ్మ స్థానములను పొంది కర్తవ్యములను సక్రమముగా నిర్వహించిన బ్రహ్మశ్రీ పిశుపాటి శ్రీరామమూర్తి అవధానిగారికిని, శ్రీ బ్ర. శ్రీ. ముదిగొండ వేంకటప్పయ్య గారికి శ్రీ బ్ర. శ్రీ. వే. కూరపాటి అంజనేయావధానిగారికిని, మరియు ఆర్థికముగా సహకరించిన అజ్ఞాత భక్తులకు, ఆలయ పండితులకు, అర్చక బృందమునకు, ఆలయ పరివారమునకును, శ్రీత్రికూటేశ్వరస్వామి కరుణా కటాక్ష సుధలు ప్రసరింపచేసి సకల శుభ సంపదలు చేకూర్చు గాక యని త్రికరణ శుద్ధిగా కోరుచున్నాము. మేము ప్రచురించిన శివార్చనా గ్రంథమును పఠించి క్షేత్ర మహిమను గూడ తెలిసికొని ధన్యులు కాగలరు.

ఇంతటి పవిత్రపుణ్యక్షేత్రం సర్వాంగ సుందరంగా రూపుదిద్దుకోవడానికి గౌరవమంత్రివర్యులు డాకర్. కోడెల శివప్రసాదరావుగారి అవిరళకృషి అభినందనీయం. ఇక్కడ ఇంకా జరగవలసిన అభివృద్ధి కార్యక్రమాలు ఎన్నో ఉన్నాయి. వాటన్నిటికి సహృదయులైన భక్తులు, దాతలు, యథాశక్తి సహకరించి శ్రీ త్రికోటేశ్వరస్వామి కృపకు పాత్రులు కావలసినదిగా ప్రార్థితులు. ఈ పుస్తకం సుందరంగా రూపుదిద్దుకోవడంలో సహకరించిన డాక్టర్. యెల్లాప్రగడ మల్లికార్జునరావుగారికి, దీనిని చక్కగా ముద్రించిన మాస్టర్ ప్రింటింగ్ ప్రెస్ అధినేతలు శ్రీజంపని సంజీవరావుగారికి కృతజ్ఞతలు.

ఇట్లు

**బొల్లేపల్లి సత్యనారాయణ**

**లలితాంబ దంపతులు**

ఓం తత్ సత్ ఓం

# ఆశీస్సు

**పూజ్యశ్రీ శ్రీ శ్రీవిద్యానందగిరిస్వాములవారు**
**శ్రీవ్యాసాశ్రమవ్యాసపీఠాధిపతులు, ఏర్పేడు.**

సత్యజ్ఞానానందస్వరూపు లగు ప్రియాత్మబంధువులారా ! సృష్ట్యాదిలో బ్రహ్మదేవుడు స్వసంకల్పముచేత సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులను సృష్టించెను. బ్రహ్మమానసపుత్రు లైన వీరు నైష్ఠికబ్రహ్మచారు లై, వేదాంతవిచారణతో మెలగుచుండిరి. ఒకప్పుడు

సర్వే వేదా యత్పద మామనంతి, తపాంసి సర్వాణి చ యద్వదంతి, య దిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి, త త్తే పదం సంగ్రహేణ బ్రవీ మ్యో మి త్యేతత్

సమస్తవేదములు ఏ గమనీయస్థానమును ఏకరూపముగా ప్రతిపాదించు చున్నవో, సమస్తతపస్సులు దేనిని చెప్పుచున్నవో అనగా దేనియొక్క ప్రాప్తికొఱకైనవో మరియు దేనిని పొందదలచినవారై బ్రహ్మచర్యమును చరింతురో దానిని సంగ్రహముగా చెప్పుచు న్నను. అది ఓమ్.

ఈ ఓంకారమును బాగుగా నెరుగదలచిన వారై వారు బ్రహ్మదేవునిద్గరకు వెళ్ళిరి. ప్రశ్నించిరి. ఆయన అకార, ఉకార, మకారములు, మరియు అమాత్ర రూపముతో ఆ ఓంకార మొప్పు నని వానియర్థముల విశేషముగా వివరించెను. కాని ఆసనకాదులు - మంత్రములో య దిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి అని యున్నది. ఈయునకు సరస్వతీదేవి భార్య య్యైయున్నది. బ్రహ్మచర్యము లేదు. కనుక ఈబ్రహ్మదేవునకు ఓంకారార్థము చక్కగా తెలియబోదు. అని తలంచినవారై విష్ణుదేవుని సమీపమునకు వెళ్ళి ప్రశ్నించిరి. ఆయన మిగుల విశదముగా బోధించెను. అయినను లక్ష్మీదేవి ఈయనకు భార్య య్యైయున్నది. బ్రహ్మచర్యము లేదు. కాబట్టి ఈవిష్ణుదేవునికిని ఓంకారార్థము స్ఫుటముగా తెలియబోదని భావించిరి.

ఇక త్రిమూర్తులలో మిగిలిన పరమశివుని దర్శింప నెంచిరి. శివదేవు డీవిషయమును చక్కగా నెరిగి, కైలాసమును వీడి, ఒకమఱ్ఱిచెట్టుక్రింద పద్మాసనాసీను డై మహాతేజస్సు తో ప్రకాశించుచుండెను. కైలాసమున కేతెంచుచుండిన సనకాదు లా తేజస్సును గాంచి, ఈ తేజ స్సేమిటో యెరింగి పిదప కైలాసమున కేగుద మని తలంచి అచటికి వచ్చి కూర్చొనిరి.

చిత్రం వటతరో ర్మూలే వృద్ధా శ్శిష్యా, గురు ర్యువా !
గురో స్తు మౌనం వ్యాఖ్యానం శిష్యా స్తు ఛిన్నసంశయాః ॥

మఱ్ఱిచెట్టుమూలమునందు శిష్యులు వృద్ధులు, గురువు యువకుడు. లోకమున గురువు వృద్ధుడుగాను, శిష్యులు యువకులుగాను నుందురు గదా. ఇది విచిత్రముగా నున్నది. మరియు గురువుగారి వ్యాఖ్యానము( బోధ) మౌనము. శిష్యుల సమస్తసంశయములు విచ్ఛిన్నములైనవి, ఇది మరియొకవిచిత్రము. లోకమున గురువులు విషయముల విడదీసి వివరించిచెప్పినను శిష్యులసంశయములు నశించుట యే విశేషము.

తాత్పర్య మే మన పరమశివుడు యువకు డై మహాతేజముతో చిన్ముద్రను ధరించి, వటవృక్షము క్రింద కూర్చొనియుండెను. సనకాదులు ఆదిమునులు గదా! కనుక వృద్ధులు. చిన్ముద్ర యనగా - బొటనవ్రేలు పరబ్రహ్మము. చూపుడు వ్రేలు జీవుడు. ఆయిద్దరికి ఐక్య ముండును. తక్కినమూడు వ్రేళ్ళు వరుసగా సత్వరజస్తమో గుణములు. ఈజీవుడు ఆగుణములతో గూడియున్నంతవరకు సంసారమున బద్ధుడై యుండును. ఇత డెపుడు సజ్జనసాంగత్యముచేత సత్ప్రవర్తనతో కర్తవ్యకర్మలను నిష్కామముగా (ఫలముల భగవదర్పణ మొనర్చి, కర్తృత్వాహంకారమును వదిలి) అనుష్ఠించునో అప్పుడు చిత్తశుద్ధి కలుగును. పాపము నశించు నని భావము. దాని వలన ఆత్మానాత్మవివేక ముదయించి, గురుదేవునిద్వారా ఆయాత్మ నుపాసించువిధ మెరిగి, తైలధారవలె నుపాసించి (ధ్యానించి) చిత్తైకాగ్రతను బొందును. ఈశ్వరానుగ్రహముతో సాధనచతుష్టయసంపన్ను డగును. అప్పుడు సాష్టాంగ నమస్కారాదులతో శ్రోత్రియబ్రహ్మనిష్ఠుడైన సద్గురువు నాశ్రయించి శ్రవణ, మనన, నిదిధ్యాస, నిర్వికల్పసమాధులతో గుణాతీతు డై బ్రహ్మాత్మైక్యసాక్షాత్కారమును బొందును. ముక్తు డగును. ఇదియే చిన్ముద్రారహస్యము.

ఇట్టి దక్షిణామూర్తికి నెల వగుటచే ఈకొండయందు పార్వతీదేవికి స్థానము లేదు. తూర్పుముఖముగా గూర్చుని తప మొనర్చినయెడల మంత్రసిద్ధియు, పశ్చిమముఖముగా గూర్చున్న తాపసికి కార్యసిద్ధియు, ఉత్తరది క్కైన మునికి మోక్షసిద్ధియును కలుగును. ఈయన దక్షిణముఖు డైనందున నేసిద్ధియు తన కవసరము లేనివా డని తాత్పర్యము. భక్తులకు సర్వసిద్ధుల నొసంగువాడు సుమా! సిద్ధీచ్ఛ యున్నంతవరకు ముక్తుడు గానేరడు. కాబట్టియే భగవద్గీతయందు మోక్షముకొఱకు కర్మజ్ఞానాదియోగముల బోధించి శ్రీభగవంతుడు చివరిది యగు అష్టాదశాధ్యాయమున మోక్షసన్న్యాసయోగమును ప్రబోధించెను. కావున పరమ శివుడు ఎట్టి కామనయు లేక దక్షిణముఖు డయ్యెను. అందుచేత దక్షిణామూర్తి యని సార్థకనామధేయు డయ్యెను. కావున :-

నమః ప్రణవార్థాయ, శుద్ధజ్ఞానైకమూర్తయే,
నిర్మలాయ, ప్రశాంతాయ, దక్షిణామూర్తయే నమః ॥

ఓంకారమునకు అర్థ మైనవాడు, శుద్ధజ్ఞానైకమూర్తి, నిర్మలుడు, ప్రశాంతుడును నైన దక్షిణామూర్తికి నమస్కారము. అని నమస్కరింపబడెను.

అట్టి దక్షిణామూర్తి స్థాన మైనకోటప్పకొండ మిక్కిలిపవిత్ర మైనది. మిగుల ప్రశస్త మైనదియు నగును. దీనిచరిత్రయే కోటప్పకొండచరిత్ర యనుగ్రంథ మగును.

ఇట్టిమహామహిమాన్విత మగుటచేత దేవాదాయశాఖవారు మరియు శ్రీయుతులు డాక్టరు కోడెల శివప్రసాదు గారు, భారతీ ధార్మిక విజ్ఞాన పరిషత్ కన్వీనరు శ్రీమాన్ బొల్లేపల్లి సత్యనారాయణగారు మొదలగు జీర్ణోద్ధరణ కమిటీ సభ్యు లైన ప్రముఖులు శ్రీ కోటప్పకొండ సర్వతోముఖాభివృద్ధికొరకు పాటుబడుచున్నారు. వీరందరు మిగుల ప్రశంసనీయులు. వీరికృషి సర్వదా సఫలీకృత మగు నటుల పరమేశ్వరు డైన దక్షిణామూర్తి అనుగ్రహించు గాక.!

ఓం లోకా స్సమస్తా స్సుఖినో భవంతు.
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః
ఓం తత్ సత్ ఓమ్.

## శుభాశీః

పూజ్యశ్రీస్వామివిద్యా స్వరూపానందస్వాములవారు
శుకబ్రహ్మాశ్రమము, శ్రీకాళహస్తి

**పరమేశ్వరుడు** దక్షిణామూర్తిరూపంలో సమస్తలోకాలకు గురువు, సర్వ విద్యలకు నిధి. అందుచేతనే ఆయనను మేధాదక్షిణామూర్తి అంటారు. పరమేశ్వరుడు అట్టి దక్షిణామూర్తిగా యోగనిష్ఠలో వుంటూ దేవతలకూ, ఋషులకూ బ్రహ్మోపదేశం చేసినచోటు ఈ కోటప్పకొండ అని జనశ్రుతి.

ఈపరమేశ్వరుడుండే కొండ (1)రుద్రశిఖరం, (2) విష్ణుశిఖరం, (3)బ్రహ్మశిఖరం అను పేర్లుగల మూడు శిఖరాలతో కూడి యున్నందున దీనికి త్రికూటాచలం అని పేరు వచ్చింది. ఇందులో వుండే స్వామికి త్రికూటేశ్వరుడు అని పేరు వచ్చింది.

ఇట్టి దివ్యజ్ఞాన దానక్షేత్రాన్ని జీర్ణోద్ధరణ చేసి మంచిసౌకర్యాలు కలుగజేయడం ద్వారా విశేషజనానికి దర్శనభాగ్యం కలుగజేయడం ముదావహం. ఇందుకు నడుం బిగించిన జీర్ణోద్ధరణసంఘసభ్యులు మంత్రివర్యులు శ్రీ కోడెల శివప్రసాద్ గారు అభినందనీయులు. కుంభాభిషేకవిషయంలో శ్రీబొల్లేపల్లి సత్యనారాయణగారి విశేష కృషి ప్రశంసనీయం.

ఈసందర్భంలో భారతీధార్మిక విజ్ఞానపరిషత్తు (గుంటూరు) ద్వారా శ్రీ బొల్లేపల్లి సత్యనారాయణగారు శ్రీశివార్చనమ్, కోటప్పకొండచరిత్ర అనే ఈ గ్రంథాన్ని ప్రచురించడం చాల సంతోషదాయకం. ఇందులో శ్రీశివార్చనను సమగ్రంగా ప్రకటించి పరిషత్తువారు ఎంతో మంచి చేశారు. భక్తులందరు ఈ గ్రంథాన్ని అధ్యయనం చేసి శివార్చనావిధానాన్ని తెలిసికొని శివార్చనానిష్ఠాపరులై జీవితాన్ని చరితార్థం చేసుకొందురు గాక! శ్రీత్రికూటేశ్వరుడు మీ అందరిని అనుగ్రహించు గాక యని మామంగళాశాసనలు.

ఓమ్.

శ్రీవిశ్వగురు భగవన్ మఠము
శ్రీవిద్యారణ్యనగర్
(నృసింహపురి) నరసరావుపేట, (ఆం.ప్ర)

నరసరావుపేట
01.02.99

భారతీ ధార్మిక విజ్ఞాన పరిషత్తు, గుంటూరు.
కార్యదర్శి, భక్తశ్రీ బొల్లేపల్లి సత్యనారాయణగారికి

మీరు కోరిన ప్రకారము శ్రీశ్రీశ్రీ భగవానులవారు అనుగ్రహించిన దివ్యాశీస్సులు మీకు పంపుచున్నాము - అంతేవాసిని, మాతా సద్విద్యాప్రభాదేవి.

## శుభాశిషః

శ్రీజగత్ప్రభు శ్రీవిశ్వగురు,
శ్రీశ్రీశ్రీ విద్యారణ్యభగవాన్.

ఆంధ్రప్రదేశ్‌యందలి ప్రసిద్ధశైవక్షేత్ర మగు కోటప్పకొండలో వెలసియున్న శ్రీత్రికూటేశ్వరస్వామి వారిదేవస్థానము ఈబహుధాన్యనామసంవత్సరములో విస్తృతముగా పునర్నిర్మాణ మొనర్చబడి మహాకుంభాభిషేకపూర్వకముగ మహాశివరాత్రిపర్వమునకు సంసిద్ధ మగుచున్న ఈశుభతరుణంలో ఈ పరిషత్తువారు మనకోటప్పకొండచరిత్ర శివార్చన అను పుస్తకమును ప్రచురించి ఆస్తిక భక్తలోకమునకు ముదము చేకూర్చినందులకు చాల సంతోషించుచున్నాము.

ఈ పవిత్రపుస్తకమును అందరూ చదివి తమ జీవితములను దివ్యభావవిలసిత మొనర్చుకొని ధన్యులు అగుదురు గాక!. ఇటువంటి ధార్మిక గ్రంథములను ప్రచురించుచు ప్రజలకు హితము చేకూర్చుచున్న ఈ పరిషత్తు వారి కృషి ప్రశంసనీయము.

అందరికి శుభపరంపరలు కలుగు గాక.

ఇతి శివమ్.

# శుభాశంసనం

శ్రీస్వామిని శారదా ప్రియానంద,
చిన్మయారణ్యం, కోటప్పకొండ.

శ్రీ త్రికూటేశ్వర స్వామివారిదేవస్థానం జీర్ణోద్ధరణ, కుంభాభిషేక సంప్రోక్షణ మహోత్సవసందర్భంగా - గుంటూరు భారతీ ధార్మిక విజ్ఞాన పరిషత్ వారు ముద్రించిన శివార్చనం-కోటప్పకొండచరిత్ర ను చదివితిని. దక్షిణామూర్తివారి ఆకర్షణీయముఖచిత్రముతో, దక్షిణామూర్తి వారి స్తోత్రాలు, మహాన్యాస రుద్రాభిషేక మంత్రాలతో, శైవసిద్ధాంతము, శైవాగమాలు, శైవ, వైష్ణవ, గాణాపత్య, శాక్త, ఆదిత్య ఉపనిషత్‌లతో సర్వాంగసుందరంగా అలరారుతున్నది. సామాన్యభక్తులకు, దీక్షాపరులైన పూజాతత్పరులలో నిత్యము స్వామివారిని సేవించే పూజారులకు, పురోహితులకు జ్ఞానమార్గంలో పయనించే ముముక్షువులకు, అందరికీ ఉపయోగపడే విషయా లన్నీ పొందుపరచబడిఉన్నాయి. ఏ స్థాయి సాధకుల కైనా అన్నీ ఒక్కొక్కరకంగా ఉపయోగపడతాయి. మనశాస్త్రాలలోని అనర్ఘమగునవి సేకరించి ప్రత్యేకపుస్తకముగా అందించిన పరిషత్‌వారు ధన్యులు. జనావళికి మహోపకారం చేసినారు. శ్రీత్రికూటేశ్వరస్వామివారి స్తోత్రావళి, కోటప్పకొండ చరిత్ర, స్వామివారి క్షేత్రమహిమ, వెల్లడిచేసినారు.

శ్రీ త్రికూటేశ్వరస్వామి వారు భారతీ ధార్మిక విజ్ఞాన పరిషత్ ద్వారా ఇలాంటి ఏన్నో మహత్తరమైన గ్రంధములు ముద్రింపజేసి భక్తులను అనుగ్రహించెదరు గాక.

ఇతి శమ్

# ప్రశంసా

**పూజ్యశ్రీస్వస్వరూపానందస్వాములవారు**
**న్యాయవేదాంత సర్వదర్శనాచార్యులు,**
**శ్రీశివగిర్యాశ్రమము, చిత్తూరు జిల్లా.**

భక్తిరసామృతాస్వాదనరతాః! నితాంతనిర్మలస్వాంతాః! భో భాగవతాః!

ఆధివ్యాధిబాధితే, దుఃఖదావాగ్నిదగ్ధే ఉస్మిన్ జగతితలే త్రివిధదుఃఖనిర్వారణార్థం జగత్ప్రభోః జ్ఞానప్రదాయకస్య, శ్రీ పరశివపరమాత్మనః సమగ్రస్వరూపనిరూపకః, మహన్యాస, రుద్రాభిషేక, శివపంచాయతన దేవతార్చన, లఘుపూజా, శ్రీ దక్షిణామూర్తి కవచ, హృదయ శ్రీ శైవానుక్రమో ఉపి చ సమాయుక్తః గ్రంధరాజో ఉయం విరాజతే భవతాం కరకమలే !.

గ్రన్థే ఉస్మిన్ విశిష్య ఆంధ్రదేశే గుంటూరు మండలే కోటప్పకొండ ఇతి నామ్నా ప్రసిద్ధే శ్రీ త్రికూటాచలే విరాజమానస్య మహాదేవస్య, శ్రీ త్రికూటేశ్వరస్వామినః చరిత్ర మపి విద్యతే! అస్య విశిష్టగ్రంథరాజస్య ప్రకాశనే రతాః శ్రీ భారతీ ధార్మిక విజ్ఞాన పరిషదః ప్రముఖపాత్రధారిణః శ్రీమంతః బొల్లేపల్లి సత్యనారాయణ మహోదయాః ప్రశంసార్హాః భవంతి !

అస్మిన్ గ్రంధే సగుణారాధకానాం భక్తాగ్రేసరాణాం కృతే అర్చన ప్రకారః సమగ్రరూపేణ ప్రతిపాదితః. త త్రాపి భక్తజనానాం సర్వేషాం సౌకర్యార్థం లఘుపూజాపి ప్రకాశితా ! అపి చ కే తే షోడశోపచారాః, ఉపచారేషు గతమతభేదాః కే, ఇతి సమ్యక్ ప్రతిపాదితా ః. ఏవం మధుపర్క విచారాదయో ఉపి సప్రమాణం నిరూపితాః! ఏవ మస్మిన్ గ్రంథే పంచాక్షరీ, పంచదశాక్షరీ మంత్రాణాం వివరణ మి త్యాదయో విశేషాః బుధజనగ్రాహ్యాః వర్తన్తే !

సగుణధ్యానవిహీనస్య న హి నిర్గుణవేదనమ్ ఇతి శాస్త్రోక్తిః! అతః సర్వే సగుణోపాసకా గ్రంథే ప్రతిపాదిత ప్రకారేణ శ్రీ దక్షిణామూర్తి స్వరూపేణ ప్రసిద్ధం శ్రీ త్రికూటేశ్వరం అర్చయిత్వా భక్త్యా భగవదనుగ్రహం సంప్రాప్య గ్రంధప్రకాశకానాం పరిశ్రమం సఫలీకుర్వంతు.

సర్వేషాం భక్తజనానాం సౌకర్యార్థం శ్రీ త్రికూటాచలే రాజమార్గ నిర్మాణే, శ్రీ స్వామిదేవాలయజీర్ణోద్ధరణ కార్యే, అన్యేషు స్వామిసేవాకార్యేషు చ సంతతరతాః శ్రీమంతః డా॥ కోడెల శివప్రసాదరావు మహోదయాః, శ్రీమంతః బొల్లేపల్లి సత్యనారాయణ మహోదయాః, అన్యే ఉపి సేవాధురంధరాః శ్రీ త్రికోటేశ్వర స్వామినః కరుణాకటాక్ష వీక్షణరతాః భవేయు రితి శ్రీ సదాశివం సంప్రార్థయామి.

-- 0 --

# సత్య దీక్ష

గం గణపతయే నమః

శివాజ్ఞ లేనిదే చీమైనా కుట్ట దంటారు పెద్దలు. శ్రీ బొల్లేపల్లి సత్యనారాయణ గారు కోటప్పకొండ అభివృద్ధి కార్యక్రమాల్లోనూ, శ్రీశివార్చనమ్ గ్రంథముద్రణ విషయంలోనూ, చొరవ చూపించడానికీ, నిర్విఘ్నంగా ఆపనులన్నీ విజయవంతం కావడానికీ అక్షరాలా ఆశివానుగ్రహమే పెట్టుబడిగా భావించవచ్చు. అయితే ఆ పరమేశ్వరదివ్యకటాక్షవీక్షణాలకు తోడు ఎందరో సిద్ధులు, యోగులు, దివ్య పురుషులఆశీస్సులు, గౌరవమంత్రివర్యులు డాక్టర్ కోడెల శివప్రసాద్‌రావుగారి ప్రోత్సాహం అన్ని సమ్మిళిత మై ఓ మహాశక్తిగా మారి శ్రీ సత్యనారాయణగారిచేత ఉరుకులు, పరుగులు పెట్టించి పనులు చేయించా యనడంలో అతిశయోక్తి ఏమాత్రమూ లేదు.

శ్రీ కోటయ్య స్వామి పాదాశ్రితు లైన సత్యనారాయణగారు రెండు దశాబ్దాల నుంచి -. లలితా, విష్ణు, సహస్రనామాలు, రుద్ర, చండీ, గణపతియాగాలు నిర్వహిస్తూ లోకకల్యాణానికి కంకణబద్ధులై. లోకేశ్వరునిసేవకు అంకిత మయ్యారు. కేవలం వారు యజ్ఞయాగాలు చేయడమే కాక అటువంటి సత్సంకల్పం కలిగినవారు ఎవ రైనా వారిస్థితిగతులను దృష్టిలో ఉంచుకోకుండా వారిచేత కూడా యజ్ఞయాగాలు చేయించడం వారిఔదార్యానికి మచ్చుతునక. ఈకార్యక్రమాలకు తోడుగా ఎన్నో దేవాలయాలజీర్ణోద్ధరణకు సహకారము, మరెన్నో ఆలయాలనిర్మాణానికి ప్రోత్సాహాన్నీ అందించారు.

కోటప్పకొండదేవాలయం జీర్ణోద్ధరణం పనులలో శ్రీజగద్గురువులు శృంగేరి స్వామివారిని నాలుగు ఐదు పర్యాయములు కలిసి ఆశీస్సులు, సలహాలు తీసుకొని పను లన్నిటినీ సమన్వయిస్తూ అందరినీ ఒకతాటిమీద నడిపించి విసుగు, విరామం

లేకుండా ఆయన కృషి చేశారు. తనఇలువేల్పు అయిన త్రికోటేశ్వరస్వామిసన్నిధిని కనీసం నెలలో ఒకసారైనా దర్శించనిదే, ఆస్వామికి అర్చనలు చేయించనిదే ఆయనకు నిద్ర పట్టదు. విచిత్రవిషయ మేమి టంటే అక్కడ ఉండే కోతులు కూడ ఆయనను గుర్తుపట్టి పలకరింపుకోసం అన్నట్లు దగ్గర కొచ్చి వెళుతుంటాయి. ఆయన కిందనుంచి వాటిని పిలిస్తే కొండపై నుంచి పరుగెత్తుకు వచ్చి ముందుంటాయి. ఆ కొండకీ సత్యనారాయణగారికీ అణువణువునా ఉన్న ఆప్యాయతానుబంధాలు అంతటివి.

త్రికోటేశ్వర స్వామి చరిత్రను సేకరించడంలోనూ, శ్రీశివార్చనమ్, కోటప్పకొండచరిత్ర గ్రంథంగా దాన్ని పరిపూర్ణంగా తీర్చిదిద్దడానికి ఆయన చేసిన కృషి అనితర సాధ్యం.

ఇలాంటిశ్రమ పడుతూ కూడ ఎలా ఆనందంగా ఉండగలుగుతున్నారు అని ఆయన్ని ఎవరైనా ప్రశ్నిస్తే సమాధానం మాత్రం ఇలా ఉంటుంది. ఇది నా గొప్ప కాదు లే వయ్యా, కోటప్పకొండ సంకల్పసిద్ధి ఉన్న పవిత్రపుణ్యక్షేత్రం. నా చేత పనులు చేయించింది మాత్రం జగద్గురు శృంగేరీపీఠాధిపతులు, ఏర్పేడు పీఠాధిపతులు, శుకబ్రహ్మాశ్రమాధిపతులు, శివగంగాపీఠాధిపతులు, శ్రీశైలం జనార్దనానందస్వామి, రత్నానందస్వాములు ఇలా ఎందరెందరో స్వాముల ఆశీస్సులు, గౌరవ మంత్రివర్యులు డాక్టర్. కోడెల శివప్రసాదరావుగారి ప్రోత్సాహం నన్ను ముందుకు నడిపించాయి- అని చిద్విలాసంగా చెప్పి ప్రశాంతవదనంతో తమపనిలో తాము మళ్లీ నిమగ్నమై శివార్చన చేస్తుంటారు.

ఇట్లు
**వి. లక్ష్మీ సునీత.**

# శివ సమర్చనము

నమః ప్రణవార్థాయ, శుద్ధజ్ఞానైకమూర్తయే,
నిర్మలాయ, ప్రశాంతాయ, దక్షిణామూర్తయే, నమః ॥

శ్రీకోటప్పకొండదేవాలయము జీర్ణోద్ధరణకు శ్రద్ధవహించిన వారిలో ఒకరైన శ్రీయుతులు బొల్లేపల్లి సత్యనారాయణగారు కన్వీనరుగా భారతీ ధార్మిక విజ్ఞాన పరిషత్తువారు ప్రచురించిన శ్రీశివార్చనమ్ (కోటప్పకొండచరిత్ర) అను గ్రంథమును పరిశీలించితిని. ఈ గ్రంథపఠనముతో నాకు కల్గిన అభిప్రాయమే ఈ శివసమర్చనము.

జన్మనాం నరజన్మ దుర్లభమ్.

జననమరణచక్రభ్రమణమున పరిభ్రమించుజీవుడు తనపుణ్యకోటి ప్రభావముచే నరజన్మము నెత్తుచున్నాడు. ఆనరజన్మలో కూడ యేకొందరో భక్తి ప్రపత్తులు కల్గి భగవత్సేవ చేయుచున్నారు. భగవత్సేవ చేసుకొనవలెనని అభిలాషతో ఉన్నను ఈ తీరుబడిలేనిజీవనసమరమున ఆచార్యులకొరకు తిరుగుతీరిక, ఓపిక లేక భగవానునినామస్మరణతోనే సంతృప్తి చెందువారలపాలిట పెన్నిధివంటిది ఈ శివార్చనము. శివార్చనకు ఉపక్రమించుటకు ముందు ఆపరమశివునిగూర్చి రెండు మాటలు మీకు జ్ఞప్తిచేయుచున్నాను.

ఆదితః పరిశుద్ధత్వాత్, మలత్రయ వియోగతః,
శివ ఇ త్యుచ్యతే శంభుః సచ్చిదానందఘనః ప్రభుః.
ఆస్పదత్వాత్ అశేషాణాం మంగళానాం విశేషతః
శివశబ్దాభిధేయో హి దేవదేవః త్రియంబకః.

మలత్రయవియోగముచే మొదటినుండి పరిశుద్ధు డైనకారణముగ సచ్చిదానందరూపు డైనప్రభువు శివు డని వ్యవహరింపబడుచున్నాడు. నిరంతరము సమస్తము లైనశుభపరంపరలకు నిలయు డైనకారణముగా దేవదేవు డైనత్రినేత్రునకు శివు డనుపేరు - అని గ్రంథములు చెప్పుచున్నవి. మలత్రయవియోగమువలన పరిశుద్ధత్వము ఏమియో ఆలోచించెదము.

ప్రతిజీవిలోనిఅంతఃకరణము కర్మబీజసంస్కారములకు నిలయ మైనది. ఆ అంతఃకరణము చిత్తవృత్తి, బుద్ధివృత్తి, మనోవృత్తి, అహంకారవృత్తి అనెడి నాలుగు ప్రవృత్తులతో కూడుకొని ఉండును. అంతఃకరణ, మలదోషము= జన్మాంతరవాసనలతో కూడుకొనుట, విక్షేపదోషము = మానసికచాంచల్యము కల్గి ఉండుట, ఆవరణదోషము = స్వస్వరూపజ్ఞానము లేకపోవుట - అను వానితో సంబంధము లేనివాడు కనుకనే శివు డైనాడు.( శివః= మంగళప్రదః) అంతియే కాక సచ్చిదానందమునకు మూర్తిమంతుడుగా చెప్పదగినవాడు ఆశంభువు.

కొన్నిఇతిహాసములవలన, మరి కొన్నిప్రమాణములవలన శివుడే దక్షిణా మూర్తి యని, ప్రణవార్థమే ( ఓంకారమే) ఆదక్షిణామూర్తి యని తెలియుచున్నది.

పూర్వ మొకప్పుడు సప్తర్షులు తాము నిత్యము చేయుచున్న యోగాభ్యాసము వలన ఆత్మానందము, పరమశాంతి ఏమాత్రము పొందనివా రై, ఏకారణమువలన తాము అటువంటిస్థితిని ఎదుర్కొనుచున్నారో తెలిసికొనుటకై ఈశ్వరునివద్దకు బయలుదేరినారు. ఆసమయములో హిమవత్పర్వతప్రాంతములు చేరునప్పటికి ప్రశాంతప్రదేశములో ఆపర్వతసానువులపై శివుడు దక్షిణాభిముఖు డై చిన్ముద్రలో నుండి ధ్యానము చేయుచు కన్పించినాడు. పద్మాసనాసీను డై, చిన్ముద్రతో నుండి ఆత్మదర్శనానందము ననుభవించుచుండగా ఆతేజస్వంతుడు కనులు తెరచినపుడు తమసందేహనివృత్తి చేసికొనవచ్చు నని భావించి వారు అట్లే నిరీక్షింపసాగిరి. దినములు గడచినవి. ఆతడు ముద్రను వీడి బాహ్యజగత్తుకు రాలేదు. అపుడు ఆ ఋషులును ఆతనివలె ఆసనబద్ధు లై చిన్ముద్రను ధరించి ఆతనికి ఎదురుగా కూర్చుండి ధ్యానము చేయసాగిరి. పరమాశ్చర్యము. ఆమహానుభావులు క్రమముగా సమాధి సిద్ధించి, దక్షిణామూర్తియొక్క మౌనవ్యాఖ్యానముతో ప్రబోధితు లై అంతర్ముఖత్వము పొందినారు. పిదప కొంతకాలమునకు వారు సమాధినుండి మేల్కొని తమకు కల్గిన యోగసిద్ధికి అచ్చెరువందినారు. నేత్రములు విప్పిన దక్షిణామూర్తికి నమస్సు లర్పించి, దేవా ! యోగమువలన ఆత్మానుభూతిని పొందక, ఆఅనుభూతికొరకు మీవద్దకు చేరినాము. మీఉపదేశము ఏమాత్రము లేకయే మాకు ఆత్మానందానుభూతి సిద్ధించినది. దీనికి కారణ మేమి యని విన్నవించినారు. వారిసందేహమునకు మందహాసము చేయుచు, యోగిపుంగవులారా! మానవజన్మను పొందినజీవుడు తరింపవలె నని కోరుకొనుట, ఆత్మసాక్షాత్కారము పొందవలె నని కోరుకొనుట ఆతనిసుకృతవిశేషము. నేను వేసినచిన్ముద్ర అర్థము

చెప్పెదను వినుడు. పరమాత్మకు ప్రతీక ఐన అంగుష్ఠముతో, జీవాత్మకు ప్రతీక అయిన తర్జని కలిసి, త్రిగుణములకు అతీతు డై పరమాత్మానుసంధానముతో అంతర్ముఖత్వమును పొందును. ఆసమయమున మూడువేళ్ళు దూరముగ (తర్జనికి) ఉండును. కనుక (సత్వ రజ స్తమో) త్రిగుణరహితు డై సమాధిస్థితిని పొందును. సమాధిస్థితివలన లభించినసమత్వము జీవునకు శాంతి చేకూర్చును. నేను ధ్యానమునం దుండి నన్ను అనుకరింపవలసినదిగా మీకు స్ఫురింపజేసితిని. అట్లు నన్ను అనుకరించి మీరు ఆత్మానందానుభూతితో సమత్వమును సాధించి కృతార్థు లైనా రని పల్కినాడు. ఈఇతిహాసమువలన శివుడే దక్షిణామూర్తి యని తెలియుచున్నది. ఇటువంటిసంఘటననే తెల్పునట్టి

చిత్రం వటతరో ర్మూలే వృద్ధాః శిష్యాః, గురు ర్యువా,
గురో స్తు మౌనవ్యాఖ్యానం, శిష్యాః ఛిన్నసంశయాః.

వటవృక్షమువమూలమం దున్నయువకు డైనగురువుయొక్క మౌనవ్యాఖ్యానమువలన వృద్ధు లైనశిష్యులకు సంశయములు నశించినవి. ఎంత చిత్రమో ? ఈశ్లోకము కూడ దక్షిణామూర్తి ఘనతనే చాటుచున్నది. ఆ దక్షిణామూర్తియే ప్రణవమునకు అర్థ మని -

నమః ప్రణవార్థాయ, శుద్ధజ్ఞానైకమూర్తయే,
నిర్మలాయ, ప్రశాంతాయ, దక్షిణామూర్తయే నమః.

అనుశ్లోకము బలపరచుచున్నది."తస్య వాచకః, ప్రణవః" ఆతనిని తెల్పునట్టిది ప్రణవము( ఓం కారము). ఆఓంకారస్వరూపు డైనవాడే శ్రీ దక్షిణామూర్తి. మేధాదక్షిణామూర్తి అని కొందరు వ్యవహరించుచుందురు. అది అంతగ వాడుకలోనికి ఎట్లు వచ్చినదో తెలియదు. శివుడు దక్షిణాభిముఖుడై తప మాచరించుటచే దక్షిణామూర్తిగ వ్యవహార మందియున్నాడు. దక్షిణదిక్కుతో తప మొనర్చువారికి ఏకోర్కెలు ఉండ వని ప్రతీతి. కోర్కెలు తీర్చగలస్వామికి కోర్కెలు ఏమి ఉండును?

అంతటివిశిష్టత కల్గినదక్షిణామూర్తియే త్రికూటేశ్వరుడుగా విలసిల్లినా డని ప్రతీతి. త్రికూటములు అనగా యోగదృష్టితో బ్రహ్మగ్రంథి, విష్ణుగ్రంథి, రుద్రగ్రంథి. ఇవి మనశరీరమునందు ముఖ్య మైనవి.

ఇంద్రియములద్వారా గ్రహించినసమాచారమును మెదడుకు పంపుట బ్రహ్మగ్రంథిపని. శరీరారోగ్యమును చూచుచు శరీరమును చక్కగ సంరక్షించుట విష్ణుగ్రంథిపని. వ్యక్తికి కావలసినమానసికవికాసమును చేకూర్చుట రుద్రగ్రంథిపని. ఇవిక్రమముగా (1) బ్రహ్మగ్రంథి-మూలాధార, స్వాధిష్ఠానము లకు మధ్యగా వెన్నుపూసలోను, (2) విష్ణుగ్రంథి - మణిపూరక అనాహతములకు నడుమను, (3)రుద్రగ్రంథి - విశుద్ధి ,ఆజ్ఞలకు నడుమను ఉండును. వ్యక్తి యోగవిద్య నభ్యసించునపుడు క్రమముగా ఓంకారధ్యానముతో సాక్షిమాత్రముగ నుండి మూడిటిని క్రమక్రమముగ దాటి కుండలినిని జాగృతము చేయవలె నని యోగుల వచనములు. కుండలినీజాగృతమువలన సో ఽహం= అతడే నేను అనుఅనుభూతి పొందగల్గును. అపుడు ఆవ్యక్తికి దుస్సాధ్య మైనది ఏదీ ఉండదు. ప్రకృతి వశ మై తీరును.

మానవులు ఆస్తిక్యతకు దూరముగా పోకుండుటకై పూర్వులు ఆలయములు, పుణ్యక్షేత్రములు ఏర్పరచినట్లు భావించవచ్చును. భౌతికజగత్తుతో సంబంధము ఉండి, అలోచనచే శారీరకజగత్తులో జీవుడు పరిభ్రమించుటకు ఈ క్షేత్రము[illegible] ఆలయములు స్ఫూర్తి నిచ్చును.

ప్రస్తుతము ఈకోటప్పకొండపై వేంచేసియున్న స్వామి కోటీశ్వరుడు. కోటప్పకొండకు త్రికూటాచల మని,త్రికూటేశ్వరునకు కోటయ్య అని వ్యవహారము. అవే వా[illegible]కలో కోటప్పకొండ, కోటయ్య స్వామి ఐనారని ప్రతీతి.

త్రికూటేశ్వర[illegible] క్షేత్రమాహాత్మ్యమువలన దక్షయజ్ఞమునందు సతీ వియోగముచే శివుడు జ్ఞానమూర్తి యై, తప మొనర్చుచు ఈక్షేత్రముపై నెలవున్నట్లు తెలియుచున్నది. ఈక్షేత్రమున కొండపైభాగమున ఏవైపునుండి చూచినను రుద్రశిఖరము, విష్ణుశిఖరము, బ్రహ్మశిఖర మని పేర్లు గల మూడుశిఖరములు కనిపించును. అందువలననే ఈపర్వతమునకు త్రికూటాచలము, త్రికూటేశ్వరము అనుపేర్లు ప్రసిద్ధము. రుద్రశిఖరమున నెలకొన్న స్వామిని చేరుటకు బ్రహ్మశిఖరము, విష్ణుశిఖరము దాటి పోవలెను. గోపకాంత ప్రార్థనపై ఈశ్వరుడు కొండ దిగి వచ్చె నని కథ.

మనపూర్వీకుల ఆచారవ్యవహారములలో, పూజామహోత్సవములలో అంతర్లీనముగ ఆత్మజ్ఞానము నందించుచున్నా రనువిషయము మనకు తెలిసినదే.

ఆపద్ధతిలో ఇచట ఆలోచించిన ముక్తిని కోరినజీవుడు క్రమముగ బ్రహ్మగ్రంథిని, విష్ణుగ్రంథిని, రుద్రగ్రంథిని ఛేదించవలె నని తెల్పుదురు. ఇచట బ్రహ్మగ్రంథియే బ్రహ్మశిఖర మని, విష్ణుగ్రంథియే విష్ణుశిఖర మని, రుద్రగ్రంథియే రుద్రశిఖర మని భావించిన ఆపరమాత్మను దర్శింపవలె నన్న క్రమక్రమముగ సాధనలో ఈమూడిటిని అధిగమించవలె నని గ్రహించవచ్చును. ఇట్లు పూర్వులు బాహ్య మైనపూజావిధానము ద్వారాన అంతరంగ మైనపూజను తెల్పినా రని భావింపవచ్చు. మనభారతక్షేత్రము కర్మజ్ఞానతపములకు ప్రసిద్ధి వహించినభూమి కనుక, కర్మద్వారాన జ్ఞానమును పొందు మార్గములు పలురీతుల తెల్పుస్థలములు పెక్కు కలవు. వానిలో ఒకటి ఐన ఈ కోటప్పకొండ మిక్కిలి ప్రసంశనీయ మైన చరిత్ర కల్గినది.

శివార్చనవిషయమున మరి యొకరిసహాయము లేక చక్కగ అభిషేకము నిర్వహించుకొనవచ్చును. ఇందులో పాత్రలు ఎన్ని ఉండవలెనో తెల్పియున్నచో పూజాకార్యక్రమముతో పరిచయము లేనివారలకు కూడ సులభముగ అవగతమయ్యెడిది.

పూజకు కావలసినసామగ్రిని ఒక పట్టికగ ఇచ్చినచో బాగుండు నని నా అభిప్రాయము. భారతీధార్మికవిజ్ఞానపరిషత్తువారలు వ్యయప్రయాసలను ఓర్చుటలో కడు సమర్థులు. కనుక ప్రవాసాంతరభారతీయులను దృష్టిలో ఉంచుకొని వారి సౌకర్యార్థము ఏకరుద్రము, ఏకాదశరుద్రాభిషేక విధానము క్యాసెట్టు చేయించిన మిక్కిలి బాగుండు నని నా ఊహ. అది వారలు ఆలోచించగలరు. ఆప్రాంతములలో అర్చకులు దొరకుట బహుదుర్లభము. కనీసముఏశిశుజనన మప్పు డైనను, కార్తిక మాసమం దైనను శివార్చన చేయుట మనకు విధి. కనుక అట్లున్నచో బాగుండును.

ఈగ్రంథముపై నున్న దక్షిణామూర్తి ఇట్టే హృదయములందు హత్తుకొనుచు గ్రంథావలోకన కుతూహలమును కల్గించుచున్నాడు. అక్షరరూపముగ నున్న ఈపరిషత్తువారిసేవ కడు శ్లాఘనీయము. ఇట్టివే మరి యెన్నియో గ్రంథములు వీరిద్వారాన భక్తులకు చేరువ కాగల వని భావించుచు,

నమస్సులతో

కె. స్వరాజ్యలక్ష్మి,

లెక్చరరు, టి.జె.పి.యస్. కాలేజి, గుంటూరు.

# శ్రీశివార్చనమ్ విషయానుక్రమణిక

## గ్రంథప్రస్తావన



## కోటప్పకొండ చరిత్ర

## శ్రీ త్రికోటీశ్వరస్తోత్రావళి



## శ్రీ శివార్చనమ్ - శివవైభవమ్



## శ్రీ శివార్చనమ్ - ఉపనిషద్వైభవమ్

### అష్టమూర్తి ఉపనిషదష్టకమ్

## శ్రీశివపంచాయతన దేవతోపనిషదః



## శ్రీశివార్చనమ్-అర్చావైభవమ్

# శ్రీశివార్చనమ్-స్తుతివైభవమ్



--0--

# కోటప్పకొండచరిత్ర

## మున్నుడి

**డా॥ మడకా సత్యనారాయణ,** ఎం.ఏ., పిహెచ్.డి.,
ఆంధ్రోపన్యాసకులు, **నరసరావుపేట.**

మనకోటప్పకొండను దర్శిస్తే సకల పాపాలు, సమస్త దోషాలు, తొలగి పోతాయని ప్రతీతి. మహా మహిమాన్వితమైన ఈ పుణ్యక్షేత్రంలో పరమేశ్వరుడు దక్షిణామూర్తిగా యోగనిష్ఠుడై దేవతలకు ఋషులకు బ్రహ్మోపదేశం చేసినట్లు స్థలపురాణాలు వివరిస్తున్నాయి. పరమ పవిత్రమైన ఈ పర్వతక్షేత్రం నరసరావుపేట పట్టణానికి దక్షిణంగా పన్నెండు కిలోమీటర్ల దూరంలో ఎల్లమంద, కొండకావూరు గ్రామాలమధ్య ఉంది.

మహాశివరాత్రి పర్వదినాన కోటప్ప కొండవద్ద ఉపవాస జాగరణాదులతో ప్రభల ఉత్సవం జరిపించే సంప్రదాయాన్ని భక్తుడు కోర్ని సాలంకయ్య ప్రారంభించినట్లు పరిశోధకులు భావిస్తున్నారు. అయితే సాలంకయ్య ఎప్పటివాడనే విషయం చెప్పడానికి సరైన ఆధారాలు లేవు.

కోటప్ప కొండ ప్రశస్తి క్రీ॥ శ॥ 1000 సంవత్సరాలకు పూర్వమే ఉన్నట్లు ఈ ఆలయంలోని కొన్ని దానశాసనాలే వివరిస్తున్నాయి. "దక్షిణ ఇండియా శాసనములు" వాల్యూం-4-లో 915వ నెంబరు మొదలు 925వ నెంబరు వరకు కోటప్ప కొండ శాసనాలు ముద్రితాలు. ఈ చారిత్రక అంశాలను మద్దులపల్లి గురుబ్రహ్మ శర్మ గారు తమ శ్రీత్రికోటీశ్వర చరిత్రములో సోదాహరణంగా పేర్కొన్నారు.

క్రీ.శ.6,7 శతాబ్దాలలో ఈప్రాంతాన్ని పాలించిన ఆనంద గోత్రీకులు విష్ణుకుండినులు త్రికూటాధిపతులుగా బిరుదు వహించారు. అయితే వారికాలంలో కోటప్ప కొండ దేవాలయం యే మేరకు అభివృద్ధి సాధించిందో వివరించే ఆధారాలు

లభించటం లేదు. కోటప్ప కొండ కోవెల దాన శాసనాల్లో **వెలనాటి గొంకరాజు, వెలనాటి చోడ భీమనాథుడు, వెలనాటి కులోత్తుంగ చోడుడు, వెలనాటి రాజేంద్రుడు** మొదలైన పేర్లు కనిపిస్తున్నాయి.

త్రికోటీశ్వరస్వామికి భూములు సమర్పించిన వారిలో శ్రీకృష్ణ దేవరాయలు, నరసరావుపేట జమిందారు శ్రీ రాజా మల్రాజు వేంకట రాయునివారు, చిలకలూరిపేట జమిందారులైన శ్రీ మానూరి వారు, అమరావతి శ్రీరాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయనివారు, పెట్లూరివారిపాలెం జమిందారు శ్రీ గణపతిరావు బాబుగారు మరెందరో అజ్ఞాతభక్తులు కోటప్పకొండ దేవాలయం అభివృద్ధి కోసం యధాశక్తి తమవంతు పాత్ర నిర్వహించారు.

మహాశైవ శాంభవీదీక్ష మంత్రోపాసకులైన శ్రీ పినపాటి ఏలేశ్వర అయ్యవారు ఈ దేవాలయ ప్రశస్తి కోసం, జనాకర్షణ యంత్రం స్థాపించి అష్టదిగ్బంధనం చేశారు.

జాతీయోద్యమకాలంలో జాతీయనాయకుల చిత్రపటాలతో ప్రభలుకట్టి దేశభక్తి భావాలను ప్రబోధించిన ఘట్టాలు కోటప్పకొండ వద్ద జరిగాయి.

కాలం గడిచేకొద్దీ లక్షలాది యాత్రికులతో రద్దీ ఎక్కువౌతున్న కోటప్ప కొండ పుణ్యక్షేత్రాన్ని సకల సదుపాయాలతో పర్యాటక కేంద్రంగా తీర్చిదిద్దాలనే సత్సంకల్పం నాటి శాసనసభ్యులు నేటి రాష్ట్ర పంచాయతీరాజ్ శాఖామాత్యులు మాన్యశ్రీ డాక్టర్ కోడెల శివప్రసాదరావు గారికి కలిగింది. లక్షలాది భక్తులు కొండ ఎక్కే శ్రమలేకుండా ఘాట్‌రోడ్ నిర్మాణం జరిపించాలని సంకల్పించారు. ఆయన కృషి ఫలితంగానే 1986 ఏప్రియల్ 9వ తేదీన ఆనాటి ముఖ్యమంత్రి పద్మశ్రీ నటరత్న నందమూరి తారకరామారావు గారు కోటప్పకొండ ఘాట్‌రోడ్ నిర్మాణానికి శంకుస్థాపన చేశారు. 4.7కిలోమీటర్ల పొడవు ఘాట్‌రోడ్ వేయటానికి రూపకల్పన జరిగింది. ఇటీవల ఘాట్‌రోడ్ పనులు శరవేగంతో చకచకా సాగాయి. సుమారు రెండున్నర కోట్ల రూపాయల ఖర్చుతో లక్షలాది భక్తుల కోసం నిర్మించిన ఘాట్‌రోడ్ ప్రజాసేవకు సిద్ధమైంది. ఎప్పటికప్పుడు అధికార యంత్రాంగాన్ని అప్రమత్తం చేసి

ఘాట్‌రోడ్ పూర్తిచేయించటంలో డాక్టరు కోడెల శివప్రసాదరావుగారు చేసిన కృషి, అందుకు రాష్ట్రముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబు నాయుడు, సంబంధిత ప్రజాప్రతినిధులు అందించిన సహకారం కోటప్పకొండ చరిత్రలో చిరస్మరణీయమవుతుందని భావించటం అతిశయోక్తి కాదు.

ఆలయపునరుద్ధరణ, బస్సులు నిలిపే విశాలస్థలం, మంచినీటి సదుపాయం, అభిషేక మండపము, సుందరమైన ఆలయ గాలిగోపురం మొదలైన నిర్మాణ కార్యక్రమాలు శ్రీ శృంగేరి పీఠాధిపతి శ్రీ శ్రీ శ్రీ జగద్గురు శ్రీ భారతీ తీర్థ స్వామి వారి దివ్యాశీస్సులతో ఆంధ్రప్రదేశ్ దేవాదాయ ధర్మాదాయశాఖ వారి సహకారంతో, శ్రీ కోడెల శివప్రసాదరావుగారి కృషితో శరవేగంతో జరిగిన తీరు ముదావహం. వాటిని శోభాయమానంగా తీర్చిదిద్ది పూర్తిచేసిన విధం ప్రశంసాపాత్రం. **కోటప్ప కొండ చరిత్ర** సంకలన కర్తలు భారతీధార్మిక విజ్ఞానపరిషత్తు (గుంటూరు) కన్వీనరు శ్రీ బొల్లేపల్లి సత్యనారాయణగారు, జగమెరిగిన ఆధ్యాత్మిక చింతనా తత్పరులు. ధార్మికగ్రంధాలను ప్రచురించటం శ్రీ రుద్రయాగ శ్రీ చండీయాగాలను నిర్వహించటమే తమ జీవిత పరమార్థంగా పురోగమిస్తున్న సహృదయులు. శ్రీసత్యనారాయణగారి సతీమణి శ్రీమతి లలితాంబగారు భగవన్నామ సంకీర్తనంలో తన జీవితాన్ని ధన్యం చేసుకుంటున్న శ్రీ లలితా పరాభట్టారికా భక్తురాలు. వీరి ఇలవేలుపు శ్రీత్రికోటేశ్వరస్వామి. వారు 1977వ సంవత్సరం నుండి యిప్పటివరకు రుద్రయాగం, పూజలు భక్తితో నిర్వహించటం నేనెఱుగుదును. ఈ దేవాలయ జీర్ణోద్ధారణ సంఘం వారి, దేవాదాయ ధర్మాదాయశాఖ వారి కృషి అభినందనీయం.

--0--

శ్రీగణేశ్వరాయ నమః
శ్రీమాత్రే నమః
శ్రీమేధాదక్షిణామూర్తయే నమః.

శ్లో॥ ఓం నమః ప్రణవార్థాయ, శుద్ధజ్ఞానైకమూర్తయే,
నిర్మలాయ, ప్రశాంతాయ, దక్షిణామూర్తయే నమః.

# కోటప్పకొండచరిత్ర

శ్రీమంతము, సకల కళాశ్రీమంతమునైనమన భారత దేశము వేదభూమి. తపోభూమి, కర్మభూమి, ధర్మభూమి అని విశ్వవిఖ్యాతి పొందినది. ఇది విశ్వమునకు మార్గదర్శకమై జ్ఞానవిజ్ఞానసుధలను పంచి, అజరామర కీర్తి పతాకాలను నెలకొల్పినది. దీని నాదర్శవముగా స్వీకరించియే అన్ని దేశవములును సంస్కారసంపత్తిని సంపాదించుకొన్న వనుట నిత్యసత్యము.

కాశ్మీరము ముఖబింబమందలి తిలక రేఖగాను, వింధ్యపర్వతశ్రేణి నీలాల మొలనూలుగాను, సింహలసీమ వజ్రాలపాదపీఠముగాను, విలసిల్లు నీపవిత్రవిశాల దేశవమున బహురాష్ట్రవములు తవంతవస్వస్థానవేషభాషాసంప్రదాయస్వయం ప్రతిపత్తులతో అత్యంతఖ్యాతిని సంతరించుకొన్నవి.

ఇట్టిదేశమం దున్నతసంస్కృతి నార్జించినరాష్ట్రములలో సర్వాదర్శమైన ధార్మికజ్ఞానసంపద, త్యాగ గుణదక్షత, కర్తవ్యతానిష్ఠ తన కొకప్రత్యేకభూషణమై వెలయుగా(ఆంధ్రదేశము) తెలుగుదేశము విరాజిల్లు చున్నది. ఈఆంధ్రదేశ వైభవమునుగూర్చి మహాపండితశిరోమణి యగు అప్పయ్యదీక్షితులవారు ఆంధ్రత్వము, ఆంధ్రభాష మహాతపశ్శక్తిసంపన్నులకు మాత్రమే లభించునని ప్రశంసించిరి.

ఇంతమహత్త్వము గల తెలుగుదేశమునఅనేక పుణ్యక్షేత్రములు అనగా, శ్రీశైలము, శ్రీ కాళహస్తి, అమరావతి, ద్రాక్షారామము, తిరుపతి, భద్రాచలము, మున్నగునవి తమఅపారమైన మహిమతో సర్వశ్రేయోదాయకశక్తితో, భక్తకోటికి కోర్కెలను నెరవేర్చుచున్నవి. ఇట్టిక్షేత్రములలో సకలశక్తులు కలిగి కేవలజ్ఞానలక్ష్మికి,

మంత్రసిద్ధికి ప్రధానకేంద్రముగా వెలుగొందుచున్న మహాక్షేత్రము "త్రికూటా చలము." దీనిని తెలుగువారు "కోటప్పకొండ"అనియు, "కోటయ్యకొండ" అనియు, "ఎల్లమంద కోటయ్య కొండ" అనియు పిలుచుచున్నారు.

ఇక్కడ దక్షప్రజాపతి యజ్ఞమొనరించి విఫలుడైన తరువాత శ్రీ పరమేశ్వరుడు సతీవియోగమున విరాగియై, జ్ఞానమూర్తియై ఇచ్చటనే నెలకొనినట్లు క్షేత్రపురాణాదులవల్ల వెల్లడి యగుచున్నది. దక్షయజ్ఞమందు సతీదేవి తన దేహమును అగ్ని కాహుతి యొనర్చినసంగతి తెలుసుకొని క్రోధమూర్తి యైనశివునితేజస్సు నుండి ఉద్భవించిన వీరభద్రునిధాటికి భీతిల్లినదేవత లందరును శివుడు లేనియజ్ఞమున పాల్గొన్న తమఅజ్ఞానమును తొలగించుకొనుటకై ఈత్రికూటాచలమున వేంచేసియున్న జ్ఞాననిధి యైనపరమశివునివలన జ్ఞానోపదేశము నొందినట్లు, దక్షుని అపరాధమును సంపూర్తిగా క్షమించి రక్షించ మని వేడినట్లును, శివుడు వారి విన్నపము మన్నించి దక్షునకు గొఱ్ఱెతల నమరించి అతని పశుత్వలక్షణమును వెల్లడి చేసినట్లును తెలియును.

వెలనాటి ప్రాంతమందున్న బెల్లంకొండ, కొండవీడు, అద్దంకిసీమల నడుమనున్న ఈకొండ 1500 ఎకరాలస్థలము నాక్రమించి యున్నది. దీనిఎత్తు 1587 అడుగుల ఎత్తు, దీని చుట్టుకొలత దాదాపు 10 కిలోమీటర్లు. అడుగుతక్కువ ఆమడ అనియు ప్రతీతి కలదు.

ఈపర్వతము వినుకొండకు తూర్పున 30 కిలోమీటర్లు, నర్సరావుపేటకు దక్షిణమున 12 కిలోమీటర్లు, చిలకలూరి పేటకు పడమర 16 కిలోమీటర్లు, అద్దంకి కి ఉత్తరమున 40 కిలోమీటర్లు దూరమున ఉన్నది.

ఏవైపునుండి చూచినను ఈ కొండపైభాగమున 3 శిఖరములు కనిపించును. 1 రుద్రశిఖరము. 2. విష్ణుశిఖరము 3. బ్రహ్మశిఖరమని వాని నామములు. అందు వలననే దీనికి "త్రికూటాచల" మనుప్రసిద్ధి ఏర్పడినది. ఈకొండమీది రుద్ర శిఖర ప్రదేశమున ప్రాతకోటేశ్వరస్వామి వెలసెను. ఇచ్చట చిన్న గుడియు, లింగము, దాని కెదురుగా శిథిలావస్థలో నున్న కొయ్యధ్వజమును గలవు. ఈ స్వామి భక్తుల

మానసికబాధల తొలగించు మహిమ కలవాడు. శ్రావణమాసమున ఈస్వామిని పూజించిన జ్ఞానసంపద లభించుట నిశ్చయము అని పుణ్యపురుషులందరు భావింతురు. సాలంకయ్య అను భక్తు డీస్వామిని సేవించి తరించెను.

విష్ణుశిఖరమందు లోకరక్షకుడైన శ్రీమహావిష్ణువు "పాపనాశనేశ్వరుడు" అను లింగరూపమున వెలసియున్నాడు. కార్తిక మాసమునం దీస్వామిని పూజించిన సకల దుఃఖములు తొలగు నని పురాణవచనము. దీనినే "గద్దలబోడు" అని అందురు. ఈప్రదేశమునగల దొనలందు స్వచ్ఛమైన జలము సర్వదా సంపూర్ణముగా నుండును. ఈదొనలు దేవనిర్మితములు.

బ్రహ్మశిఖరము రుద్రశిఖరమునకు వెలుపల గలదు. ఈబ్రహ్మ శిఖరముమీదనే నేడు ప్రజల పూజలందుచున్న నూత్న కోటీశ్వరుడు నెలకొన్నాడు. ఈస్వామి భక్తులకోర్కె లన్నియు తీర్చుదయామయుడు. విశ్వకల్యాణ సంధాయకుడు.సకలజ్ఞానప్రదుడు. దీనజనబాంధవుడు. ఈకోటీశ్వరస్వామిని మాఘమాసమున అర్చించిన సర్వపాపములు తొలగు ననియు, మోక్షసామ్రాజ్య లక్ష్మి చేపడుననియు దృఢముగా నమ్ముదురు. ఈత్రిశిఖరములపై వెలసిన లింగమూర్తుల ప్రభావ మేనాటికిని తరుగదని పరమేశ్వరుడే తెలిపెను.

శ్రావణమున రుద్రశిఖరస్వామిని, కార్తికమున విష్ణుశిఖరస్వామిని, మాఘమాసమున బ్రహ్మశిఖరస్వామిని సేవించిన తాపత్రయము నశించి ముక్తిదాయకమైన లింగార్చన ఫలము లభించును. ఇక్కడ పార్వతీదేవి లేనందున కోటీశ్వరస్వామిని జ్ఞానానందమయు డగు శ్రీ దక్షిణామూర్తిగా భావించుచున్నారు. విద్వన్మణిసిద్ధాంతిశిరోమణియు నగు చింతలపాటి వీరనీలకంఠకుటుంబ రామశాస్త్రిసిద్ధాంతి గారు తమ త్రికూటేశ్వరతారావళిలో దక్షిణాస్య, దక్షిణామూర్తి శబ్దములతో స్వామిని సంబోధించినారు. అత్యధికమేధాశక్తిని, అత్యంత ప్రజ్ఞాపాటవమును ప్రసాదించుస్వామి గావున నారీతిగా సంభావించి రని మనము భావింపవచ్చును. ఈవిషయము పండితులు, విమర్శకులు, నిర్ణయించి తెలుపవలసినదే - ఈ సందర్భమునందే ఈ స్వామిని సేవించి తరించి శిలారూపులై వెలసిన మహాభక్తులను గూర్చి తెలిసికొనుట ముఖ్య మని భావించి వివరించు చున్నాము.

## సాలంకయ్య చరిత్ర :

**ఈ**కోటప్పకొండకు సమీపమున "ఎల్లమంద " అను పేరు గలగ్రామము **కలదు. అందు** కోర్ని వంశమున " సాలంకయ్య " అనునతడు జన్మించెను. అతడు సద్గుణసంపత్తి గలవాడు. శక్తివంతుడు. అతని శివభక్తినిష్ఠానియమములు అపారములు. అరిషడ్వర్గమును జయించిన సాలంకయ్య శివభక్తశ్రేష్ఠుడై ఆరు లింగస్థానముల నెఱింగెను. వీరశైవు డైనయితడు యోగవిద్యయందును, శివపూజా విధానమందును పారంగతుడు. శరీరకష్టముతో కట్టెలను కొట్టి విక్రయించి వచ్చిన సొమ్ముతో అతడు జంగమార్చన చేసెడివాడు. శివభక్తులను పూజించుటయే అతని ముఖ్యబాధ్యత అయినది. ఇట్లుండగా ఒకనా డతడు కొండపైకెక్కి కట్టెలు కొట్టుచు అలసి చెట్టునీడకు జేరి దాపుననే గలకోటీశ్వరలింగమును దర్శించెను. అత డానందభరితుడై ఆస్వామిని మనసారపూజించెను. నాటినుండి ప్రతిదినము దొనలో స్నానమాడి భస్మధారియై, రుద్రాక్షమాలికలు దాల్చి, పంచాక్షరీమంత్రము జపించుచు స్వామివారికి షోడశోపచారము లొనర్చుచు బిల్వదళములతో అష్టోత్తర శతనామపూజలు సల్పుచుండెను. ఒకనాడు కొండపై గలబిల్వవనమును చూచి అక్కడనే యుండి తప మొనర్చిన ముక్తి కలుగు ననియు పరమాత్మకు సన్నిహితుడ నగుదు ననియు తలంచెను. ఆసంకల్పము దృఢము కాగా మారేడుచెట్టునీడయందు పద్మాసనముతో, మౌనదీక్ష వహించి కోటీశ్వరునిగూర్చి తప మొనరించుట కుపక్రమించెను. ఇట్టికఠోరదీక్షతోనే అతడు కాలము గడుపుచుండగా నొకనాడొక జంగమయ్య ప్రత్యక్ష మాయెను. అతనిని చూచి పరమశివునిగా భావించి అర్చించి తనగృహమునకు విచ్చేయు మని ప్రార్థించెను. ఆజంగమయ్య వానిప్రార్థనకు అంగీకరించి అతనియింటి కేగి కేవలము క్షీరములను మాత్రమే త్రాగుచు కొన్ని దినము లుండి తరువాత అదృశ్యు డాయెను. సాలంకయ్య వానికై వెదకి వేసారి నిరాశతో నిరాహారదీక్ష పూనెను. ఒకనాడు బ్రహ్మశిఖరప్రాంతమున తిరుగుచున్న సాలంకయ్యకు అక్కడి ఒకగుహలో దివ్యతేజోరూపమున దర్శన మిచ్చి మీయింటిలో విందారగించినది నేనే, నేను నీవాడను, పరమేశ్వరుడను, నే నిచ్చటనే యుందును. ఇక్కడ దేవళము నిర్మించి నన్ను లింగరూపమున ప్రతిష్ఠించి పూజింపుము. మహాశివరాత్రినాడు నియమవంతుడవై అభిషేకాదు లొనర్చి, ప్రభలు కట్టించి, నాటి రాత్రి జాగరణ మొనర్చు మనియు ఆపూజా ఫలముచే నీవు శివైక్య మందెద వనియు

తెల్పెను. సాలంకయ్య కోరుకొనగా శివైక్యసంధానపద్ధతిని గూడ నుపదేశించి తేజోమూర్తి యైన ఆ యోగీంద్రు డంతర్ధాన మొందెను. ఆఉపదేశము ననుసరించి ఆభక్తుడు సకలపూజావిధానములు నెరవేర్చుచు శివరాత్రినాడు అన్ని క్షేత్రములందు స్వామికి కల్యాణోత్సవము జరుగుచుండగా నిక్కడ మాత్ర మెందుకు జరుపరా దని తలంచి పార్వతీదేవిని ప్రతిష్ఠ చేయ యత్నించెను. అంత నాకాశవాణి యీ స్థలము యోగ స్థలము, భోగస్థానము కాదు. ఇది జ్ఞానరాశి యైన దక్షిణామూర్తి స్థానము. బ్రహ్మచర్యదీక్షలో నున్న స్వామి కిచ్చట కల్యాణము జరుపగూడదు అనెను. ఆవాక్కులు విని సాలంకయ్య విరక్తుడై దేహత్యాగ మొనర్ప నెంచి పీఠమధ్యమున నిలిచి లింగైక్య సంధాన మొనర్చెను. పరమేశ్వరు డతనిని తనలో లీన మొనరించుకొనెను. అతనిభౌతికరూపము లింగాకృతి గాంచెను. అతనితమ్ములు ముగ్గురును భగవద్దయకు పాత్రులై లింగమూర్తులై నిలిచిరి. ఈవిధముగా ఆ ప్రదేశము" పంచబ్రహ్మస్థానము " గా ప్రసిద్ధి చెందినది. ఈభక్తుడు సాలంకయ్య సంకల్పబలముతోనే ఈ యల్లమంద కోటీశ్వరునకు ఇంతప్రభ. ఇంత భక్తజన సమూహమునకు ప్రథమకారకుడు సాలంకయ్యే.

## ఆనందవల్లి ( గోపకాంత):

కోటప్పకొండ పరిసరమున నందిపాడు అను ఒక పల్లెయుండెను. ఆపల్లెలో యాదవకులమునందు సునందు డనువాడు జన్మించెను. అతడు చిన్న నాటినుండి కోటీశ్వర భక్తుడై ఖ్యాతి గాంచెను. అతడు పెరిగి పెద్దవాడై యుక్త వయస్సున "కుందరి" అనుకన్యను వివాహమాడెను. ఆదంపతులకు భగవత్కృపావిశేషమున ఒకకూతురు ఉద్భవించెను. ఆకన్యక పేరు ఆనందవల్లి. సునందు డాబాలికను లక్ష్మీదేవిగా భావించి సంతసించెను. ఆఆనందవల్లి భువనసుందరరూపముతో నెదుగుచు తల్లిదండ్రుల హృదయము నానందమున నోలలాడజేయుచుండెను. ఆమె అందమునకు వన్నె గొల్పుచు వినయసంపదయు పెంపొందెను. సౌందర్యమందిరయైన ఆనందవల్లి పూర్వ పుణ్యవైభవమున శివభక్తితత్పరురాలై విలసిల్లినది. ఆమె అనుదినము తనకులమువారి వెంట ఆవులను మేపుటకై నందిపాటి మీద కేగెడిది. పసితనమునుండియు ఆమె శివభక్తియుక్త యగుటచే పూలమాలల జోలికి పోక రుద్రాక్షమాలలు ధరించును.

కోటీశ్వరకథలనే పాడును. ఈపరిస్థితి నంతయును గమనించినతల్లి ఆమెతో ఒకనాడు "అమ్మా! నీ యౌవన మిట్లు విరక్తిభావముతో వ్యర్థ మొనర్చుకొందు వేల ? తగిన వరుని వివాహమాడి భుక్తికి, ముక్తికి, మూలమైన సుఖము లొందు" మనెను.

ఆపలుకులు విని ఆనందవల్లి "తల్లీ, శివుని పూజించుటవలననే తప్పక ముక్తి లభించును. ఐహికసుఖము లన్నియు క్షణికములు. శాశ్వత భోగమోక్షము లొసగు శివభక్తిని వీడి అల్పబుద్ధులవలె విషయలోలతలో మునిగి అధోగతి పాలగుటకు నే నంగీకరింప "ననెను. ఈవిధమునంతయు గమనించి సహృదయుడైన తండ్రి కుమార్తెను మంచిమాటలతో బుజ్జగించుచు "అమ్మా! నీ మేనత్తకొడుకైన సుందరుని పెండ్లియాడి మా కానందము కూర్చుము. అతడును దైవభక్తి పరాయణుడే" అని నచ్చచెప్పి ఆమె యంగీకారముతో పెండ్లి జరిపించెను. మేనత్తకొడుకు తగిన ఈడు జోడు అయిన వాడగుటచే ఆనందవల్లీ సుందరులు ప్రజలమన్ననలకు పాత్రులైరి. దయ, సౌందర్యము, వినయసంపద, దైవభక్తి కల యాకాంత వివాహానంతరము కూడ పరమేశ్వరుని పూజించుటకు కొండపైకి వెళ్ళెడిది. ఆ నవదంపతులు కోడిగా లాడుకొనుచు నిత్యము ఆవులను మేపుటకై అడవికి వెళ్ళెడివారు. అందాలరాశి అయిన తనభార్యను చూచి సుందరుడు ఉప్పొంగిపోవును. వారిరువురు హద్దులు మీరని నడవడితో నొద్దిక కలిగి కాలము పుచ్చుచుండిరి. సుందరు డేనాడును ఆమె శివపూజను నివారించలేదు. అరమరికలు, పొరపొచ్చెములు లేని ప్రణయజీవనయాత్ర సాగుచుండగా ఆనందవల్లి గర్భవతి యైనది. సీమంతాదికృత్యములు జరిగినవి. నానాటికి గర్భభారము దుర్భర మయినది. మునుపటివలె రుద్రశిఖరము పై కేగి స్వామిని కొలుచుశక్తి ఆమెకు క్షీణింప సాగెను. ఒకనాడు తాను తెచ్చిన ఆవు పాల కడవ ఒకచోట దించి పూలు తెచ్చుటకై వెళ్ళెను. ఆసమయమున నొకకాకి వచ్చి యాకడవ మీద వ్రాలగా కడవలోనిపాలన్నియూ నేలపాలాయెను. తిరిగి వచ్చిన ఆమెకు ఆదృశ్యము మిక్కిలి క్రోధమును కలిగించెను. " నేటి నుండి కాకిజాతి ఈకొండపైకి రాకుండు గాక, నీచ కాకి జాతి నిర్మూలమయి

పోను" అనెను. ఆమెవాక్కు సత్య మైనది. ఒకకాకి కూడ ఆక్షేత్రమం దెక్కడను కనిపించదు. నిశితముగా పరిశీలించిన ఇక్కడికి కాకులు రానితీరు ప్రత్యక్ష నిదర్శనముగా నున్నది. ఈవిషయము దేశప్రఖ్యాతి గొన్న ప్రబలసాక్ష్యము.

ఆతరువాత ఆనందవల్లి మరొకచోటనుండి అతిప్రయాసతో పాలు తెచ్చి కోటీశ్వరస్వామికి అభిషేకాదులతో పూజసల్పెను. పూజానంతరము చేతులు మోడ్చి ఓ స్వామి ! గర్భభారముచే కొండపైకి వచ్చి నీ పూజ చేయజాలకున్నాను. నా కోర్కె తీరున ట్లు వరము ప్రసాదించు మని ప్రార్థించెను. భక్తకోటుల భవబంధముల తొలగించు ఆ స్వామి సత్యవచన యైన ఆమెకోర్కెను తీర్ప నెంచి - ఓ ఆనందవల్లీ! నేనే కొండ దిగి వత్తును. వెనుకకు మరలి చూడకు. ముందు నడువుము అనెను. ఆమాట ప్రకారము ఆ గోపకాంత ముందు నడువసాగెను. కొంతదూర మేగిన పిమ్మట స్వామిరాకవలన కలిగిన సందడికి భయభ్రాంత యై వెనుకకు తిరిగి చూచెను. ఆవిషయమును గుర్తించిన పరమేశ్వరుడు నియమభంగ మైనది కావున నేను ఇక భూమి మీదకు రాక ఇక్కడనే నిలుతును అని యాగిపోయెను. ఆపరిస్థితికి ఆనందవల్లి విచారగ్రస్త యై దేవా! నీవు బ్రహ్మశిఖరమునందు లింగమూర్తి వై నిలిచినచో నేను మాత్ర మీలౌకికసుఖములను గోరుదునా? నీ ఉపదేశానుసారము నేను గూడ బ్రహ్మైక్య మందెదను అని ఏకాగ్రచిత్త యై స్వామిని మనసున నిలిపి జన్మను తరింపజేయు మని ప్రార్థించెను. ఆమెప్రార్థన మాలించి పరమేశ్వరుడు ఆనందవల్లి భౌతికరూపమును తనయందు లీనము గావించుకొనెను. ఆమె అచ్చటనే శిలారూప మై నిలిచెను. అప్పుడే జన్మించిన ఆమెపుత్రుడు కూడ శివైక్య మందెను. ఈనాటికిని పరమేశ్వరవచనానుసారము మొట్టమొదట ఆనందవల్లిని దర్శించిన తరువాతనే స్వామిదర్శనభాగ్యము కలుగుచున్నది. ఇది స్వామి భక్త పరాధీనతకు చక్కనినిదర్శనము.

ఆనాడు " నందిపాడు" గా పేరు గాంచినగ్రామము క్రమముగా శిథిల మై **మహామంత్రి తిమ్మరుసు** ఇచ్చిన దానస్థలముతో నేటి "కొండకావూరు " అను **గ్రామముగా** వెలసినది.

## విశేషాంశవములు

ఈపర్వతము ఆదినుండియు మునులు, తపస్విద్ధులు, యోగులు, మంత్రానుష్ఠానపరులు నివసించిన పవిత్రస్థలము. ఈనాటికి నిక్కడ ఆ మహోదయులు సంచరించుచున్నారు అని అనుభవజ్ఞులఅనుభూతి. త్రిపురాంతకమునకు కపోతేశ్వరక్షేత్రమునకు శ్రీ శైలమునకు ఈశాన్య భాగమున ఉన్నందున శైవుల కిది యొకపెన్నిధి. వారికిని దీనికిని అవినాభావసంబంధ మున్నది. ఎల్లమునులు గుంపులు గుంపులుగా వచ్చి స్వామిసేవకై యిక్కడ నివసించిన కారణమున ఇచ్చట గలగ్రామమునకు "ఎల్లమంద" అనునామము సార్థక మైనది.

ఇక్కడకు నింద్రాదిదేవతలు, మహర్షులు, మహాసిద్ధులు వచ్చి స్వామివలన జ్ఞానోపదేశము పొందినట్లు తెలియుచున్నది. ఇదొక సత్వగుణప్రధానస్థలము. దీని పైభాగమున దేవనిర్మితము లైన దొనలు, గుహలు, విష్ణుశిఖరభాగమున నేనాడును నింకిపోని సెలయేటియూటయు దైవశక్తికి ప్రబలనిదర్శనములుగా నున్నవి. ఇప్పటికిని ఈకొండమీద లంబికాయోగసిద్ధులున్నారని ప్రతీతి కలదు.

సాలంకయ్య, ఆనందవల్లి, సిద్ధమల్లప్ప మున్నగు భక్తాగ్రేసరులు నిష్ఠతో ననేక రీతుల ఆత్మపరిశీలనలు చేసి బ్రహ్మజ్ఞానము పొంది భక్తకోటికి ఈదేవాలయ పరిచయభాగ్యము నొందజేసినారు.

ఈక్షేత్రమునకు దాపున ఓగేరు (ఓంకారనది) ప్రవహించుచున్నది. ఈ నది గుత్తికొండబిలము, చేజెర్ల క్షేత్రములగుండా ప్రవహించుచు వచ్చి ఈ త్రికూట క్షేత్రము దాకి సముద్రగర్భమున లీనమగుచున్నది.

ఈక్షేత్రమందు సిద్ధులు, అష్టసిద్ధులు, నిధులు, నీనాటికిని ఉన్నట్లు ప్రమాణములు లభించుచున్నవి.

1000 సం॥ లనుండి ఈ క్షేత్రము జనసందోహములకు పరిచయమ్మైనట్లుగా శాసనాల ద్వారా తెలియుచున్నది.

ఈనాటికి చుట్టుపక్కల గ్రామప్రజలు మాఘమాసారంభమునుండి మహాశివరాత్రిదాక విశేషభక్తిభావసంపన్నులై తమపశుగణములను కొండచుట్టును ప్రదక్షిణము చేయించుట ముఖ్యముగా గణనీయ మైనవిషయము.

సుమారు 200 సం॥ లకు పూర్వము బ్రహ్మశిఖరముపై పినపాటి ఏలేశ్వర అయ్యవార్లం గారు స్వామి అనుగ్రహబలముతో మంత్రపురశ్చరణసిద్ధి, జనాకర్షణము, మ్రొక్కుబడులు, అష్టదిగ్బంధన, గణపతి, సంతానకోటీశ్వర యంత్రములు స్థాపించినట్లు శాసనాధారము లున్నవి. ఈయన యీయంత్రస్థాపనకు మంత్ర పురశ్చరణ సలుపుసమయాన నొకానొకదివ్యజ్యోతి యంత్రములం దావేశించి మహత్తును చేకూర్చినట్లును తెలియును.

600అడుగులఎత్తు గల ఈశిఖరమునకు 750 మెట్లను నరసరావుపేట జమీందారుగారు నిర్మింప జేసినట్లును, విశేషముగా అన్నదానము లొనరించినట్లును శాసనాలవల్ల తెలియుచున్నది.

ఇచ్చట ధ్వజప్రతిష్ఠ లేదు. కేవలము బ్రహ్మ చర్య దీక్షతో జ్ఞానానందమయుడై వెలసిన దక్షిణామూర్తి స్వామి యగుటచే కల్యాణ వైభవములును లేవు. ఈస్వామికి బాలకోటీశ్వరుడు, సంతానకోటీశ్వరుడు అను వాడుక కూడ కలదు.

అడవి రామలింగేశ్వరుడు, కూకట్ల శంభుడు, శంభులింగమ్మ, నాగమ్మ, వేంకటేశ్వరుడు - అనుభక్తులు స్వామిసేవలో తరించినట్లును ప్రత్యక్ష నిదర్శనము లున్నవి.

దాదాపు రెండువందలసంవత్సరాలనుండి అత్యధికసంఖ్యలో ప్రజలు విశేషాకర్షణగా వచ్చుచున్నట్లును, శివరాత్రి కింత విశేష మీయొక్కక్షేత్రమందే యున్నట్లును పెద్దలఅనుభవము ఆంధ్రప్రదేశమం దింత మహాజనసమ్మర్దము, ప్రభలవైభవము మ రెక్కడను కనుపింపదు.

## మ్రొక్కుబడులు :

తలనీలా లిచ్చుట, మెట్లపూజ, మేళతాళాలతో గూడిన ప్రభలపడితరము విశేషము. రెండువందలసంవత్సరాలనుండి నేటికిని పొట్లూరిగ్రామమునుండి నందివాహనముపై శివు నలంకరించి శివరాత్రిజాగరణమునాడు ప్రభతో వచ్చుట, ఆగ్రామప్రజ లందరు అన్నిమె ట్లెక్కి స్వామిని దర్శించుట విశేషాకర్షణము. ఇట్టి భక్తిప్రపత్తులతో స్వామిదర్శనార్థము వచ్చుగ్రామము లెన్నో ఈప్రాంతమున గలవు. ఇది స్వామిమాహాత్మ్యమునకు గొప్పతార్కాణము.

## ప్రభలు :

సుమారు 40 అడుగులు మొదలు 100 అడుగుల ఎత్తుగల ప్రభలు కట్టుకొని 60,70, కిలోమీటర్ల దూరములనుండియు నెన్నో వ్యయప్రయాసల కోర్చి లక్షలాదిధనము వెచ్చించి ప్రభలకు కరెంటుదీపాలవెలుగులు, విశేషాలంకారములు కూర్చి వచ్చుచున్నారు. ఈప్రభలను వీరభద్రావతారముగా భావించుచు మేళతాళములతో, వీరంగాలతో వచ్చుట చూచితీరవలయునే గాని వ్రాయుటకును, చెప్పుటకును సాధ్యము కాదు. దాదాపు 40 సం॥లకు పూర్వము 500 ప్రభలు వచ్చినట్లు నిదర్శనము లెన్నో యున్నవి. ఈప్రభలతో వచ్చినప్రజలకు పరిసర గ్రామ వాసులే ఆప్యాయతతో భోజనాదివసతులు ఏర్పాటు చేసెడివారు. ఇప్పటికిని కావూరు, పురుషోత్తమపట్నము, పొట్లూరు, కమ్మవారిపాలెము, నర్సరావుపేట, ఎల్లమంద, ఆకులగణపవరము , జొన్నలగడ్డ, అవిశాయపాలెము, లింగంగుంట్ల, మిన్నెకల్లు, యడవల్లి, మద్దిరాల మొ॥ 30,40 గ్రామములవారు భక్తి పారవశ్యముతో ప్రభలు కట్టి అతివ్యయప్రయాసలను సైతము లెక్కచేయక వచ్చి స్వామికి పడితరము సమర్పించుచున్నారు.

ఇక్కడ మహాశివరాత్రినాడు అంద మైనపశుప్రదర్శనలు, ఎడ్లపందెములు, ఎక్కువగా జరిగెడివి. అన్నివర్ణముల వారికిని అన్నసత్రము లున్నవి. శివరాత్రినాడు పలువిధము లైనవ్యవసాయపుపనిముట్లఅంగళ్ళు విరివిగా నుండుట గమనించదగిన విషయము. కొన్ని వేలమంది సంచారజాతులవారు దేశము నలుమూలలనుండి వచ్చి శివరాత్రికి ముందు 15 దినములనుండియే యిక్కడ నివాస మేర్పరచుకొని అత్యంతాకర్షణతో నుత్సవమందు పాల్గొని, చుట్టుపక్కల గ్రామాలకును క్రొత్త శోభను గూర్తురు.

ఈకొండకు చుట్టుప్రక్కల నున్న దాదాపు 20గ్రామములు శివరాత్రి మహోత్సవసందర్శనమునకు వచ్చిన బంధుమిత్రగణములతో కళకళలాడుచు ఆనందోత్సాహములతో నోలలాడుచుండును. అ దొకదివ్యానుభూతి యనక తప్పదు.

ఇక్కడ వర్ణవిచక్షణత యేమాత్రము లేకుండ అన్నిమతములవారు, అన్ని కులాలవారు పాల్గొని వారిపశుసంపద నంతయు నలంకరించి, గిరిప్రదక్షిణము చేసి స్వామిని సేవించుట విశేషవిషయము.

శైవులు ఈదేవస్థానము తమపురాతనసంపద యన్నభావనతో నన్ని ప్రాంతములనుండియు వచ్చి విశేషభక్తిప్రపత్తులతో నుత్సవమందు పాల్గొందురు. ఇక్కడ వారికి శైవ, లింగాయత సత్రములు గలవు.

కళాకారులుపెక్కుమంది వచ్చి అతిపురాతనము లైన తమతమ కళా ప్రదర్శనములు (చెక్కభజనలు, కోలాటములు, సర్కసులు) ప్రకటించి విశేషముగా ప్రజల నాకర్షింతురు.

కొండకు దిగువభాగమునందు అయ్యంభట్లవారు, గబ్బిటవారు, భాగివారు, నీలకంఠేశ్వరాలయప్రతిష్ఠయు, అన్నసత్రములునను నెలకొల్పినారు. శ్రీ కల్యాణానంద భారతీస్వామివా రిక్కడనే శ్రీ చండీమహామాయాదేవిని ప్రతిష్ఠించినారు. 1982లో ఇక్కడ ఓరియంటల్ స్కూలు గూడ స్థాపించినారు.

1986 సంవత్సరమున కొండ ఎక్కు సోపానపంక్తి ప్రారంభస్థలమందు మలరాజువారి అధ్యక్షతన రాజగోపురనిర్మాణము కోడెల శివప్రసాదరావు గారిచే ప్రారంభించబడినది. ఈక్రిందిస్థలమందు జిల్లాపరిషత్తువారు తోటను నాటించి దానియందు అతిథిగృహమును గూడ నిర్మించినారు.

ఇక్కడ "చిన్మయారణ్యము " అను పేరుతో దాదాపు పదియెకరాల స్థలమందు బాల, వృద్ధాశ్రమమును శ్రీశారదానందప్రియగారు నిర్వహించు చున్నారు. దీనియందు ముఖ్యముగా ధ్యాన, యోగాభ్యాసాదికములు సాగుచుండును.

1983 నుండి పూర్తిగా శివభక్తితత్పరు డైన **శ్రీ కోడెల శివప్రసాదరావు గారు** ఎమ్. ఎల్. ఏ. గాను, హోమ్ శాఖామాత్యులుగాను, భారీ ఇరిగేషన్ శాఖామంత్రిగాను పంచాయతీరాజ్ శాఖామంత్రిగాను ఉండి

**ఈ కొండకు ఏర్పాటు చేసిన సౌకర్యములు - సేవాసదుపాయములు.**

అనాదినుండి సంకల్పమందున్న ఘాట్ రోడ్డుకు ఆనాటి ముఖ్యమంత్రియైన

శ్రీ నందమూరి తారకరామారావు గారిచే శంకుస్థాపన చేయించుట, నాటినుండి సాటి లేని పట్టుదలతో రెండుకోట్ల ఏబదిలక్షల వ్యయముతో గూడిన (ప్రభుత్వ సహకారము పొంది) ఈ నిర్మాణమును పూర్తి చేయించుట,

శ్రీజగద్గురువులైన శ్రీశ్రీశ్రీ శృంగేరీ భారతీ తీర్థ స్వామివారి అనుగ్రహాశీస్సులు పొంది, చాల పురాతనమై శిథిలావస్థలోనున్న కోటీశ్వర స్వామివారి దేవాలయమును దేవాదాయశాఖవారి సహకారముతో దాదాపు కోటి రూపాయల వ్యయమొనర్చి జీర్ణోద్ధరణ గావించుట

చరిత్రలో సువర్ణాక్షరములతో లిఖింపదగిన మహోన్నత విషయములు.

నీటివసతికొరకు లక్షలకొలది వెచ్చించి శంభులింగంచెఱువును పునర్నిర్మించుట, కొండమీద నీటి కోసము పంచాయతీ శాఖవారి సాయముతో దిగువభాగమున మంచినీటిచెఱువును స్థాపించుట, ఇంకను కొండవద్ద వేదపాఠశాలను, గ్రామసంబంధ మైన చేతివృత్తులస్కూలును ఇక్కడనుండి శ్రీశైలయాత్ర చేయుట కనువుగా బస్సువసతిని రోడ్డుబ్రిడ్జీని నిర్మించుటలోను వారు చేసిన కృషియు, ఇంకను స్వామివారికొండ కెన్నోవసతులు సమకూర్చవలె నన్న వారిమనోదృఢసంకల్పము మెచ్చదగినవి. పరమశివుడు శ్రీ శివప్రసాదుని హృదయమున నిలిచి ప్రజలకు ఆధునిక సౌకర్యములు కలిగించునట్లు సంకల్పబల మొసంగుట అత్యంతముదావహము.

*గమనిక :- కోటి ఒక్క ప్రభలు కట్టితే కొండదిగి వస్తాడని కోటయ్య స్వామి చెప్పినట్లు అనుశ్రుతి.*

## ఈకొండ అభ్యుదయమునకు అనాదిగా సహకరించిన దాన శాసనాదులు వేయించిన విశేషాంశముల వివరణము :

విష్ణుకుండిన రాజులలో రెండవమాధవవర్మ కాలమున నీయాలయ మెంతో యున్నతస్థితిలో నున్నట్లునను, ఆరాజు త్రికూటమహాలయాధిపతిగను పేరుపొందినట్లు శాసనాధారములవలన దెలియుచున్నది. వెలనాటి చోళులలో కులోత్తుంగచోళమహారాజు. శ్రీకృష్ణదేవరాయలు, మహామంత్రి తిమ్మరుసు, నరసరావుపేట జమీందార్లు మలరాజు వారు ముఖ్యులు.

ఈవంలరాజువారం ఏనంగులు, ఒంటెలు, నడుచుబాటనం, సోపానములను నిర్మించి స్వామి వారికి విశేష భూవసతులు చేకూర్చినారు. శ్రీ వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు, చిలకలూరి పేట జమీందారు గారు, పెట్లూరి పాలెము శ్రీ గణపతిరావుగారును, అధిక భూవసతులు సమకూర్చి నిత్యధూప దీపనైవేద్యాదికార్యక్రమములకు సహకరించినట్లు ఆధారము లున్నవి.

1934 సంవత్సరమున ఈదేవస్థానమును దేవాదాయశాఖవారు స్వాధీన పరచుకొని మహాశివరాత్రిమహోత్సవములను వారిపర్యవేక్షణతో నడిపించుట ప్రారంభమైనది.

అగ్రహారము, గణపవరము, కావూరు, పొట్లూరుగ్రామప్రభలకు పూర్వ ప్రభువులుమాన్యములిచ్చి ప్రోత్సాహపఱచినారు. ఏప్రభలు రానిస్థితిలో నైనను మాన్యములు పొందినగ్రామాలప్రభలుమాత్రము తప్పక వచ్చి కట్టుబడి పడితరములు చెల్లించి పోవుచున్నారు. ఇప్పటికిని ఇటువంటి గ్రామములు చాల కలవు.

మేమెరిగిన వరకు 1920 నుండి 1960 మధ్యకాలములో రోడ్ల వసతి లని పరిస్థితులలో ప్రభలు ఎడ్లబండ్లు వేలలో కొన్ని లక్షల జనాభాతో చిలకలూరిపేట, నర్సరావుపేట, మాగులూరుల మధ్య ప్రదేశం తిరునాళ్ళ శోభయుండెడిది. ఈనాటివరకు స్వామివారికి అహోరాత్ర దీపారాధన జరుగుచున్నది. మురికి పూడి నాగమ్మ అనే భక్తురాలి దీపధ్వజము ఇప్పటికినీ ఉన్నది.

ఇంతటి పవిత్రక్షేత్రరాజం ఈత్రికూటాచలం. పరమేశ్వరదివ్యధామంగా వెలుగొందుతున్న ఈ కోటప్పకొండ వైభవాన్ని కనులకు కట్టినట్లు చూపిస్తున్న ఈ గ్రంధం అక్షరాలా అమూల్యమే.

క్షేత్రనాధు డైన దక్షిణామూర్తికి సంబంధించి ప్రత్యేకముగా ఉపాసన స్తోత్ర విషయాలను పేర్కొనడం సముచితంగా ఉంది. శివతత్త్వాన్ని వెలువరించే విలువైన స్తోత్రాలు వంటి వెన్నెన్నో ఉన్న ఈ శివార్చనమ్ సాక్షాత్తూ భక్తవశంకరుడైన శంకరుడికి శుభగ్రాపసారూప్యమే.

# అర్చనలు - అభిషేకములు

గోవిందపురము, కొండకావూరు, గురవాయపాలెము గ్రామస్థులు దాదాపు ఏడుతరాలనుండి స్వామివారికి అర్చనలు జరుపుచు జీవయాత్ర సాగించుచున్నట్లు ఆధారము లున్నవి.

గురిజేపల్లి అగ్రహారవువారు, రంగావఝులవారు, భాగివారు, స్వామికినిత్యాభిషేక కార్యక్రమములు నిర్వహించుచున్నారు.

**స్వామివారి కైంకర్యమునకై దానముగా ఇచ్చిన భూములు :-**

కొండకావూరు, ఎల్లమంద, సాతులూరు, జొన్నలగడ్డ, బెల్లంకొండ, ఉప్పుమాగులూరు, పెట్టూరివారిపాలెము, గురవాయపాలెము, ఉప్పలపాడు, లింగంగుంట, తంగేడుమల్లె - గ్రామములలో ఇప్పటికి సుమారు 250 ఎకరముల భూమి యున్నట్లు రూఢిగా తెలియుచున్నది.

ఇట్టి విశేషచరిత్ర మహిమ గల శ్రీకోటేశ్వరస్వామివారిని మహాశివరాత్రినాడు దర్శించి సేవించినవారికి జన్మరాహిత్య మగుట నిక్కము.

**సహ నా వవతు - సహ నౌ భునక్తు**
**సహ వీర్యం కరవావహై -**
**తేజస్వి నా వధీత మస్తు -**
**మా విద్విషావహై.**

**ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః**

కవి పండితుల సహాయసహకారాలతో

సంకలనము :

**భారతీ ధార్మిక విజ్ఞాన పరిషత్తు.**
**అశోక్‌నగర్ 4వ లైను, గుంటూరు.**

## శ్రీత్రికూటేశ్వరాలయజీర్ణోద్ధరణ సంఘం

అధ్యక్షులు : డాక్టరు. కోడెల శివప్రసాదరావు, యమ్.యస్.

సభ్యులు : శ్రీ రాయపాటి సాంబశివరావు, యమ్.పి.

శ్రీ వనమా సుబ్బారావు, మున్సిపల్ ఛైర్మన్, నరసరావుపేట.

శ్రీ బొల్లేపల్లి సత్యనారాయణ, గుంటూరు.

శ్రీ మిట్టపల్లి కోటేశ్వరరావు, నరసరావుపేట.

శ్రీ పోలిశెట్టి ఏకనాథగుప్త, గుంటూరు.

శ్రీ యంపరాల వెంకటేశ్వరరావు, గుంటూరు.

శ్రీ కూనిశెట్టి వెంకటేశ్వర్లు, మున్సిపల్ ఛైర్మన్, మాచర్ల.

శ్రీ ఊటుకూరి వెంకటసత్యనారాయణ, నరసరావుపేట.

శ్రీ కోట కోటిసుబ్బరామయ్య, నరసరావుపేట.

శ్రీ నూకల రామకోటేశ్వరరావు, తెనాలి.

శ్రీ కట్టమూరి శంకరరావు, పిడుగురాళ్ళ.

శ్రీ కందిమళ్ళ నాగేశ్వరరావు, గుంటూరు.

శ్రీ చలువాది బ్రహ్మయ్య, నరసరావుపేట.

శ్రీ పెరుమాళ్ళ వెంకటేశ్వరరావు, సత్తెనపల్లి.

శ్రీ తటవర్తి వెంకట సుబ్రహ్మణ్యం, నరసరావుపేట.

--0--

## శ్రీత్రికూటేశ్వరస్వామివారి దేవస్థానమునకు
## ఆర్థికముగా సహకారము అందించినవారు

1. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము సర్వశ్రేయోనిధి

2. శ్రీ కాళహస్తీశ్వర స్వామివారి దేవస్థానము, శ్రీకాళహస్తి.

3. శ్రీ దుర్గామల్లీశ్వర స్వామివారి దేవస్థానము, విజయవాడ.

4. శ్రీకనకమహాలక్ష్మి అమ్మవారి దేవస్థానము, విశాఖపట్నం.

5. శ్రీ వీరవేంకట సత్యనారాయణ స్వామివారి దేవస్థానము, అన్నవరం.

6. శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానము, ద్వారకాతిరుమల.

7. శ్రీ తిరుపతమ్మ అమ్మవారి దేవస్థానము, పెనుగంచిప్రోలు.

8. శ్రీ రాజరాజేశ్వరి అమ్మవారి దేవస్థానము, వేములవాడ.

9. శ్రీ హతిరామ్‌జి మఠము, తిరుపతి.

10. శ్రీ బుగ్గా మఠము, తిరుపతి.

ఇంకా అనేక అజ్ఞాత భక్తులు.

-- 0 --

## దేవాదాయ శాఖవారు స్వాధీనపరచుకొన్న తరువాత ఆలయాభివృద్ధికి తోడ్పడినవారు :-

శ్రీ రాయపాటి సాంబశివరావు, ఎమ్. పి.
శ్రీ నన్నపనేని అంకినీడు
శ్రీ మోచర్ల కోటేశ్వరరావు
శ్రీమతి & శ్రీ బొల్లేపల్లి లలితాంబా సత్యనారాయణ దంపతులు
శ్రీ పోలిశెట్టి సీతారామాంజనేయులు
శ్రీ పెరుమాళ్ళ వెంకటేశ్వరరావు
శ్రీ చిటిపోతు మస్తానయ్య పార్వతి దంపతులు
శ్రీ నూకల కామకోటేశ్వరరావు
శ్రీ ఆర్. ముత్యాలరావు ( ఇ. ఓ.)
శ్రీ ముత్యం రామకృష్ణా రెడ్డి
శ్రీ బి. బాల ప్రసాద్ ( ఇ. ఓ.)
శ్రీ కిలారి బొల్లయ్య
శ్రీ పోలిశెట్టి ఏకనాథగుప్త
శ్రీ కందిమళ్ళ నాగేశ్వరరావు
శ్రీమతి కొలగాని రత్తమ్మ
శ్రీ కుంచనపల్లి రత్తయ్య
శ్రీ పొట్టి సుబ్బారావు దంపతులు
శ్రీ కోటేశ్వరరాజు
శ్రీ కాటసాని రాంభూపాల్‌రెడ్డి, ఎమ్.ఎల్.ఏ.
శ్రీ చెఱుకూరి కాంతయ్య సోదరులు
శ్రీ ఎమ్. సాంబిరెడ్డి
శ్రీ రామినేని శివరామయ్య లీలావతి దంపతులు
ఇంకా ఎందరో అజ్ఞాత భక్తులు.

## స్వామివారి క్షేత్రమాహాత్మ్యమును (స్థలపురాణమును) వెలువరించిన కవిపండితులు :-

కొప్పరాజు నరసింహకవిగారు
కోటగిరి వేంకటనరసింహసత్యనారాయణగారు
మద్దులపల్లి గురుబ్రహ్మశర్మగారు (చరిత్ర)
రూపెనగుంట్ల సీతారామయ్యగారు ( బుఱ్ఱకథ)
మంచికంటి వేంకటేశ్వరరావుగారు ( నాటకము)
తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారు
కౌతా నరసింహశాస్త్రిగారు ( పంచాక్షరీ వివరణ)
మాదిరాజు రామకోటేశ్వరరాయకవిగారు
కొప్పరపు సోదరకవులు
పోలేపెద్ది వేంకటనరసింహశాస్త్రిగారు
దోనేపూడి లక్ష్మీనారాయణగారు ( కోటేశ్వరస్తుతి)
కొండకావూరి ఉమామహేశ్వరదీక్షితులుగారు
పొత్తూరి వీరరాఘవప్రసాదరాయశర్మగారు ( దండకము)
చింతలపాటివీరనీలకంఠకుటుంబరామశాస్త్రిసిద్ధాంతిగారు( నక్షత్రతారావళి)
చింతలపాటి నరసింహదీక్షితశర్మగారు ( కరావలంబము)
మేరికపూడి సీతాపతిరావుగారు ( శివస్వరూపవివరణ)
నిష్ఠల సుబ్రహ్మణ్యా శాస్త్రిగారు ( అష్టకము)
శారదా ప్రియానంద

ఇంకా ఎందరో అజ్ఞాతభక్తులు

## శ్రీ త్రికోటేశ్వరస్వామి దేవస్థానం
## అర్చక అభిషేక బ్రాహ్మణులు, స్వామి సేవకులు.

1. వంగర వెంకటకృష్ణమూర్తి, వేదపండితులు
2. ఆర్. శ్రీనివాసశాస్త్రి, అభిషేకబ్రాహ్మణులు
3. ఆర్. కిరణ్ కిషోర్ శర్మ
4. కొండకావూరి వెంకటప్పయ్య దీక్షితులు
5. కొండకావూరి నాగభోగేశ్వరరావు
6. కొండకావూరి సుబ్రమణ్యప్రసాద్
7. కొండకావూరి దుర్గాప్రసాద్
8. కొండకావూరి వెంకటేశ్వరరావు
9. కొండకావూరి శివాజిగణేష్ శర్మ
10. కొండకావూరి అప్పయ్యగురువులు
11. కొండకావూరి శివయ్య
12. కొండకావూరి దాగలింగేశ్వరరావు
13. కొండకావూరి వెంకటరమణ
14. కొండకావూరి శ్రీనివాసరావు
15. ఇక్కుర్తి కొండకావూరి కోటేశ్వరరావు
16. కొండకావూరి కృష్ణమూర్తిశర్మ
17. నుదురుపాటి హనుమంతరావు
18. నుదురుపాటి పోలేశ్వరరావు
19. గురిజేపల్లి కోటేశ్వరరావు

## శ్రీ త్రికోటేశ్వరస్వామివారి దేవస్థానం స్టాఫ్

1. కావూరి బాలప్రసాద్, ఇ.ఓ.
2. జి. రామకృష్ణ, యస్.ఏ.
3. ఆర్. వెంకటేశ్వరరావు
4. టి. సుధాకర్‌రెడ్డి
5. వై. వెంకయ్య
6. యస్., వెంకటేశ్వరరావు
7. సి.హెచ్.శ్రీనివాస్
8. సి.హెచ్.శివనాగిరెడ్డి
9. వై. వెంకటరెడ్డి
10. సి.హెచ్.చినరామయ్య
11. సి.హెచ్.రంగయ్య
12. వై. కోటినాగయ్య
13. ఓ. నారాయణ
14. నాగేంద్రం, స్వీపర్
15. పాములయ్య, స్వీపర్

## 1999 కుంభాభిషేకములో నున్న దేవాదాయశాఖవారు

| | | |
|---|---|---|
| కమీషనర్ | : | శ్రీయస్.యమ్.బాలసుబ్రమణ్యము, ఐ.ఏ.యస్. |
| అదనపు కమీషనర్ | : | ఎ.బి.కృష్ణారెడ్డి |
| | | యస్. అరుణకుమారి |
| ఇంజనీర్ | : | పి.నాగేశ్వరరావు |
| స్థపతి | : | యస్.పెరుమాళ్ళాచారి |
| డిప్యూటీకమీషనర్ | : | జిన్నాలక్ష్మణ |
| అసిస్టెంట్ కమీషనర్ | : | వి. అంకినీడు |
| ఇంజనీర్స్ | : | డి. ఆర్ రాములు |
| | | వై. అశోక్‌కుమార్ |
| ఇ. ఓ. | : | కె.బాలప్రసాద్ |
| కాంట్రాక్టర్ | : | దేవినేని బాలగంగాధరరావు, విజయకన్‌స్ట్రక్షన్స, గుంటూరు. |

# శ్రీత్రికోటీశ్వర స్తోత్రావళి

## 1. శ్రీకోటీశకరావలంబస్తుతిః

శ్రీమత్త్రికూటధరణీధరశృంగసంగ !
గంగాతరంగసుషమాకలితోత్తమాంగ
భక్తానుషంగ, జలరాశిలసన్నిషంగ
కోటీశ ! దేవ! మమ దేహి కరావలంబమ్ - 1

న్యగ్రోధమూలవసతే! వస-తే పదాబ్జ
సందర్శనం ప్రతిదినం హృదయే యథా స్యాత్-
త్వం మాం తథా నిరవలంబ మవ ప్రపన్నమ్
కోటీశ ! దేవ! మమ దేహి కరావలంబమ్ - 2

సోమావతంస ! భవరోగభిషగ్వతంస !
కందర్పదర్పహర! సుందరమందహాస !
మా ముద్ధరోద్ధర, తమోజలధిప్రమగ్నమ్
కోటీశ ! దేవ! మమ దేహి కరావలంబమ్ - 3

జ్ఞానీ భవ త్యఖిలరంగవిముక్తసంగో
మానీ భవ, త్యహివరాభరణాదిభిక్షో
త్వత్పాదసేవనరతో నరతోయజాక్షః
కోటీశ ! దేవ! మమ దేహి కరావలంబమ్ - 4

కల్యాణకారక మపారయశోనిధానం
దౌర్గత్యవారక ముదారమహోనిదానమ్
త్వత్పూజనం శుభసుధారసభాజనం స్యాత్
కోటీశ ! దేవ! మమ దేహి కరావలంబమ్ - 5

దృశ్యం హి నశ్య మితి సత్యవచ, స్తత స్త్వం
దృగ్గోచరో న భవ సీతి మహేశ ! మన్యే-
భూయా దిదం చ సకలాస్తికభాగధేయమ్-
కోటీశ ! దేవ! మమ దేహి కరావలంబమ్ - 6

నీవారశూకవ దణూపమమూర్తి రవ్యా
దానందచేతనకరీ, భవహారిణీ, తే
తద్దర్శనా త్ఖలు జనస్య భవా ద్విముక్తిః
కోటీశ ! దేవ! మమ దేహి కరావలంబమ్ - 7

త్వాం యే స్తువంతి సకృ దేవ నమ శ్శివా యే
త్యస్మిన్ త్రికూటవసుధాధరతుంగశృంగే
తే సర్వ దాపి వసుధా వసుధారిణ స్స్యుః
కోటీశ ! దేవ! మమ దేహి కరావలంబమ్ - 8

అత్యంతశీతలపయోరచితాభిషేకై
ర్నో కంపతే తవ తను స్సరిదుత్తమాంగ !
స్థాణూ రసేన కిము పల్లవభాగ్య మేతి
కోటీశ ! దేవ! మమ దేహి కరావలంబమ్ - 9

ఏకాకితాం భజసి, సోమధ రాష్టమూర్తే !
తద్బ్రహ్మ సత్య మనవద్య ముదార మాద్య
మేకం విలోకయత యూయ మి తీవ వక్తుమ్
కోటీశ ! దేవ! మమ దేహి కరావలంబమ్ - 10

అంబాం విహాయ విషమాంబకభంజక ! త్వం
కస్మాత్ పి తాస్య జగతో, విషమాంబ కాసి
కిం మాతృహీన ఇహ జంతు రహో ? స్వయంభూః
కోటీశ ! దేవ! మమ దేహి కరావలంబమ్ - 11

తే నాస్తి బాహుబల మేకపురే వసంతం
షడ్వర్గరూపరిపు ముగ్ర, మిమం నిహంతుమ్-
కిం త్రైపురారిహరణే మమ సాక్ష్య మత్ర-
కోటీశ ! దేవ! మమ దేహి కరావలంబమ్ - 12

స్థాణు, ర్ద్విజిహ్వకటక శ్చ, కళంకిమౌళిః
వహ్నీక్షణః, పశుపతి, ర్గజకృత్తివాసాః
త్వం-తే దయా కథ ముదేతి జనే ఉత్ర దీనే
కోటీశ ! దేవ! మమ దేహి కరావలంబమ్ - 13

వాచాలయ త్యనుదినం భవదంఘ్రిభక్తి
వీచీలతా - నవలతాంతమధూపమానైః
వాచాలవై శ్రుతిసతీవినుత ! ప్రసీద-
కోటీశ ! దేవ! మమ దేహి కరావలంబమ్ - 14

రూపం భజామి-జగదీశ్వర! రత్నగర్భా
రూపం త్వదీయ మఖిలౌషధిగంధగర్భమ్
భుక్తిప్రదం సకలభూతసముచ్చయానామ్
కోటీశ ! దేవ! మమ దేహి కరావలంబమ్ - 15

సేవే విభో! రసమయం, విమలం, స్వరూపం
భావత్క మాశ్రితజనాఖిలతాపహారి
ఆప్యాయకం తనుభృతా ముపజీవకం తత్
కోటీశ ! దేవ! మమ దేహి కరావలంబమ్ - 16

తేజోమయం-దశదిశావలయప్రకాశ
సంధాయకం-శ్రితతమఃప్రవిదారకం తే
రూపం భజే విధిహుతోరుహవిర్ధురీణమ్
కోటీశ ! దేవ! మమ దేహి కరావలంబమ్ - 17

సౌరభ్యమాంద్యశిశిరత్వ గుణప్రసన్నం
సంప్రాణనం జననభా క్ప్రకృతే స్స్వరూపమ్
సుస్పర్శనం హృది భజే మరుదాత్మకం తే
కోటీశ ! దేవ! మమ దేహి కరావలంబమ్ - 18

వైహాయసం, సకలసంవరణైకశీలం
తారావిహారలలితం, నితరా మనంతమ్
రూపం చ శబ్దగుణకం, శివ! తే స్మరామి
కోటీశ ! దేవ! మమ దేహి కరావలంబమ్ - 19

సూర్యాత్మకం నిగమమూల మనంతరత్నం
మందేహనిర్దళనధామవిభామనోజ్ఞమ్
త్వద్రూప మత్షిఫలదం కలయే ఉహ మీశ !
కోటీశ ! దేవ! మమ దేహి కరావలంబమ్ - 20

త ద్భావయే - గిరిశ ! చాంద్రమసం స్వరూపం
సంహ్లాదకం, తవ సుధామధురం, కళాఢ్యమ్-
సర్వజ్ఞమౌళిమణిభూషణ మౌషధీశమ్
**కోటీశ** ! దేవ! మమ దేహి కరావలంబమ్ - 21

సంస్కారపూత, మనలార్చనదక్షదీక్షం
తద్దైక్షితం, వపు, రహం, భవ! భావయే తే
య ద్దర్శనేన జని రేతి పవిత్రభావమ్-
కోటీశ ! దేవ! మమ దేహి కరావలంబమ్ - 22

సేవే త్రికూటమణికూటకలాప, మాద్యం
త్వాం సర్వదా, సుకృతదూరదురాప, మీశమ్
త్వం సర్వద స్సకలహృద్గతభావవేత్తా
**కోటీశ** ! దేవ! మమ దేహి కరావలంబమ్ - 23

ఈ శావధారయ-పవిత్రకరావలంబ
స్తోత్రం, యథారుచి నిబద్ధభవచ్చరిత్రమ్
శ్రీదీక్షితేన నరసింహ పదాదికేన
కోటీశ ! దేవ! మమ దేహి కరావలంబమ్ - 24

## 2. శ్రీ త్రికోటీశ్వర తారావళిః

### నక్షత్రమాలాస్తుతిః

-చింతలపాటి వీరనీలకంఠ కుటుంబ రామశాస్త్రి.

అశ్వని - అశ్వాననాచ్యుతదృగంబురుహార్చితాంఘ్రే,
శశ్వచ్ఛుకాదిసనకాదిమునీంద్రసేవ్య,
విశ్వేశ, విశ్వనిలయ, క్షితిజన్మహేతో,
శ్రీమత్త్రికూటగిరివాస, శివ, ప్రసీద. 1

భరణీ - భర్త్రే సమస్తజగతాం, భవభీతిహర్త్రే,
భర్గాయ, భాస్కరకృశానుశశీక్షణాయ,
భాగ్యప్రదాయ, భరణీపతిభంజనాయ,
శ్రీమత్త్రికూటగిరిశాయ, నమ శ్శివాయ. 2

కృత్తికా - కృత్త్యంబరాయ, కృతధీసముపాసితాయ,
కృష్ణప్రియాయ, కృపణార్తజనావనాయ,
కృష్ణార్జునార్చితపదాయ, కృపామయాయ,
శ్రీమత్త్రికూటగిరిశాయ, నమ శ్శివాయ. 3

రోహిణీ - రోహిణ్యుపేతరమణీయశరత్సుధాంశు
రమ్యప్రజాపతిసమాశ్రితపూర్ణిమాయామ్
య స్త్వాం విలోకయతి, నౌతి, స ఏవ ధన్యః
శ్రీమత్త్రికూటగిరిశాయ, శివోం, నమ స్తే. 4

మృగశిర - మృష్టాజ్యదుగ్ధమధురేక్షురసై శ్చ నారి
కేళాంబుభి శ్చ విమలై ర్మధునా చ దధ్నా
భ క్త్యాభిషిచ్య, బహుధా విబుధా స్తువంతి
శ్రీమత్త్రికూటగిరిశాయ, శి వాఖిలా స్తామ్. 5

ఆర్ద్రా - ఆర్ద్రా త్వదృక్ష మితి హి ప్రథితా త్రిలోక్యా
మార్తార్తిహ, న్నఖిలలోకగురో! మహేశ!
ఆర్ద్రోడుజాత ఇతి వా భువి మా మ వాశు
శ్రీమత్త్రికూటగిరివాస ! శివ ! ప్రసన్నః. 6

పునర్వసూ - పుణ్యాః పునర్వసుభవా అఖిలాదితేయాః
పూజ్యా నృభి ర్భువి, పునర్వసుజో హరి, శ్శ్రీ
రామ శ్చ తై రపి చ తే న చ పూజిత స్త్వం
శ్రీమత్త్రికూటగిరివాస ! శివ ! ప్రసీద. 7

పుష్య పుష్య త్య శేషకుశలం పురహూతభోగై
ర్హృష్యంత మాశు వితనోతి నరం త్వదీయః
శిష్యోనురాగ ఇతి గీష్పతి రావపుష్యం
శ్రీమత్త్రికూటగిరివాస, శివోం, నమ స్తే. 8

ఆశ్లేషా - ఆశ్లిష్ట మద్రిసుతయా కతిచి ద్భుజంతు
త్వాం శ్రీగజానన, షడానన, శోభిపార్శ్వమ్
చేత స్తు మే శివ! గురౌ త్వయి దక్షిణాస్యే
శ్రీమత్త్రికూటగిరివాస, ముదం ప్రయాతి. 9

మఖా - మన్యే మఖా మమ సుఖం దద తీతి నైవ
శ్రీదక్షిణాస్య మపహాయ భవంత మీశమ్
దక్షో ఒభవ త్కిల పు రాజముఖో మఖీ సన్
శ్రీమత్త్రికూటగిరివాస ! శివం భజే త్వామ్. 10

పూర్వఫల్గుని - పూర్వం స్మరత్రిపురమర్దనఫల్గున స్త్వా
మారాధ్య పాశుపత మేవ మహాస్త్ర మాప
కోటీశ్వరో ఒసి మమ దేహి వివేకభిక్షాం
శ్రీమత్త్రికూటగిరివాస, శివోం, నమస్తే. 11

ఉత్తరఫల్గుని - ఉత్తీర్య సంసృతిమహార్ణవ మాశ్వ పారం
శంభో ఒహ ముత్తర ఇ వారిచమూసముద్రమ్
త్వాం ఫల్గునం స ఇవ వేద్మి కదా శరణ్యం
శ్రీమత్త్రికూటగిరివాస! శివం మహేశం. 12

హస్త - హస్తే జయో భవతి, వాచి సరస్వతీ చ
పద్మా చ సద్మని, సదా కురుతే నివాసమ్
త్వ త్పాదభక్తి రమలా హృది యస్య తస్య
శ్రీమత్త్రికూటగిరివాస, శివోం, నమ స్తే. 13

చిత్రా - చిత్రాతిచిత్ర మిద మేవ జగ ద్విచిత్రమ్
భా తీహ చిత్రపటచిత్రితచిత్రతుల్యమ్
భక్తస్య తే భవభయార్ణవకర్ణధార
శ్రీమత్త్రికూట గిరివాస, శివాత్మకం సత్. 14

స్వాతి - స్వాతిప్రరూఢ మద మత్సర మోహ రాగ
ద్వేషాది దూషిత ధియో ఽపి మ మాంతరజ్ఞే
జ్ఞానాంకురార్పణవిధిం కృపయా విదేహి
శ్రీమత్త్రికూటగిరివాస, శివ, ప్రసన్నః. 15

విశాఖ - విప్రం విశాఖ మివ భార్గవరామ మన్త్ర
విద్యానిధిం కరుణయా విదధన్ స్మరారే
విశ్వేశ, విశ్వసమతాం ప్రకటీకరోషి ,
శ్రీమత్త్రికూటగిరివాస, శివోం, నమ స్తే. 16

అనురాధా - అన్వాస్యమాన మపి రాధిక యానురాధా
తారాధిపం చ వపుషా శిరసా దధానః
తం మాధవం విధు మపి త్వ ముమాధ వాసీః
శ్రీమత్త్రికూటశిఖరే కిల దక్షిణాస్య. 17

జ్యేష్ఠ - జ్యేష్ఠా పరిత్యజతి తత్క్షణ ఏవ శంభో
జ్యేష్ఠాయ తే నమ ఇతి ప్రవదంతి యే తాన్
శ్రేష్ఠా భవం త్యపి చ తే సుగుణై ర్వరిష్ఠాః
శ్రీమత్త్రికూటగిరివాస, శివోం, నమ స్తే. 18

మూల - మూలం త్వ మేవ భగవన్, జగతాం త్రయాణాం
తస్మా త్త్రికూటగిరిమూర్ధని తే నివాసః
కోటీశ్వరో ఽసి భవకోట్యఘకోటిహర్తా
శ్రీమత్త్రికూటగిరివాస, హరోం, నమ స్తే. 19

పూర్వాషాఢ - పూర్వాః కిలాప ఉదితా శ్ర్శుతిభి స్తు పూర్వా
షాఢాజలం హి తత ఏవ జలాభిషేకమ్
గంగాధరో ఽపి సతతం బహుమన్య సే కిం
శ్రీమత్త్రికూటగిరివాస, శివోం, నమ స్తే. 20

ఉత్తరాషాఢ - ఉద్ధర్తు మేవ హి పరాత్పర, విశ్వ మేత
త్త్వం విశ్వనాథ ఇతి నామ బిభర్షి కాశ్యామ్
తన్నామకం భ మపి శర్వ ముదే న కిం తే
శ్రీమత్త్రికూటశిఖరాగ్రవిహార శంభో. 21

శ్రవణమ్ - శ్రద్ధాధనా మునిజనా శ్శ్రవణర్‌క్షజస్య
బుద్ధ్యా హయాననహరే స్తవ చా ప్యభేదమ్
శ్రీ దక్షిణానన, విదుః ప్రణవార్థవిజ్ఞాః
శ్రీమత్త్రికూటగిరివాస, శివ, ప్రశాంతాః. 22

ధనిష్ఠా - ధర్మం వదంతి నిగమా జగతః ప్రతిష్ఠా
ధన్యా శ్చ తే ఉష్టవసవ శ్శివధర్మనిష్ఠా ః
ధన్యం క్రియా త్కరుణయా తవ మాం ధనిష్ఠా
శ్రీమత్త్రికూటగిరివాస, శి, వేందుమౌళే. 23

శతభిషక్ - శంభో ! భిషక్ త్వ మసి హి ప్రథమో హి దైవ్య
స్స్యా త్ప్రీతయే శతభిషక్ష మపి ప్రభో స్తే
నాన్య స్త్వ దస్తి భవరోగభిషగ్వరేణ్యః
శ్రీమత్త్రికూటగిరివాస, శి, వార్తబంధో. 24

పూర్వాభాద్రా - పూర్వై ర్మహాత్మభి రనుష్ఠిత మేవ ధర్మం
భద్రం ప్రబోధయతి యా కిల పూర్వభాద్రా
సా మే శివాయ భవతు శ్రితకల్పభూజ!
శ్రీమత్త్రికూటగిరివాస, శి, వాఖిలాత్మన్. 25

ఉత్తరాభాద్రా - ఉద్ధర్తు మేవ భువనాని చతుర్ద శా ప్య
హిర్బుధ్న్య దైవతవతీ స్థిరతా ముపేతా
యా తారకాధిపతిశేఖర ! తాం చ తారాం
శ్రీమత్త్రికూటగిరివాస, శి, వార్పయామి. 26

రేవతీ - రే ! వానరా ఇవ, నరా, న వృధా కురుధ్వం
జ న్మేద మాశ్రయత శంకరపాదపద్మమ్
ఏవం బ్రవీతి కృపయా కిము రేవతీ నాః
శ్రీమత్త్రికూటగిరివాస, శివోం, నమ స్తే. 27

# 3. శ్రీత్రికూటేశ్వరాష్టకమ్

1 నమ శ్శ్రీకంఠాయ త్రిపురరిపునాశాయ మహతే
నమ శ్శ్రీకంఠాయ ప్రణతవిపదున్మూలనబుధే
నమ శ్శ్రీకంఠాయ ప్రణతనవఖేటాయ పటవే
నమ శ్శ్రీకంఠాయ ప్రమథపతయే స్తేనపతయే.

2. నమః ప్రథమవైద్యాయ, నమ స్తామ్రారుణాయ చ
ముష్ణతాం పతయే, ఖడ్గవతే, నక్తంచరాయ, చ.

3. నమ స్సహస్రాక్ష సహస్రపాద దశాంగులాక్రాంతభువే నమ స్తే
ఆదిత్యవర్ణాయ పరాయ పుంసే స్థితాయ భూమ్నే తమసః పరస్తాత్.

4. ధృతగంగః, కృతభంగః, జితసంగో, రాజతా జ్జితానంగః,
భృతడమరుః, నటరాజః, నటతా ద్గిరిసీమ్ని మంగళశ్రీకః.

5. విత్తం చ మే, భవిష్య చ్చ, యశ శ్శ్రీయ శ్చ మే, ఋతం
వృద్ధి శ్చ మే, చ సత్యం, చ సంతు చక్షు శ్చ మే బలమ్.

6. శ్రీకంఠ శ్రీకంఠలతాః స్ఫుటాబ్జాః
శ్రీకంఠ శ్రీకంఠజితః కుముద్వాన్
శ్రీకంఠ శ్రీకంఠసమేతి భాస్వాన్
శ్రీకంఠ శ్రీకంఠ జహీహి శయ్యామ్.

7. శ్రీకంఠ! శ్రీకంఠ! హిరణ్యబాహూ శ్రీకంఠ ! శ్రీకంఠ ! వివర్తలోక
శ్రీకంఠ ! శ్రీకంఠ ! రమేశరూప, శ్రీకంఠ ! శ్రీకంఠ ! సరస్య ధన్విన్.

8. శ్రీకంఠ ! శ్రీకంఠ ! నమాంసి తుభ్యమ్
శ్రీకంఠ ! శ్రీకంఠ ! బధాన శత్రూన్
శ్రీకంఠ ! శ్రీకంఠ ! సముత్థితః స్యాః
శ్రీకంఠ ! శ్రీకంఠ ! విధేహి సౌఖ్యమ్.

-- 0 --

# 4. శ్రీ కోటీశ్వర స్తుతి

మ ॥ వరగోపాలవధూమణీకరగతం బౌ భోజనం బారగిం
చి, రహిం జెందిన భాగ్యశాలి వట ! మా జేజేలు గైకొమ్మురా !
హర ! శంభో ! శశిశేఖరా ! భవ ! విరూపాక్షా ! మృడానీపతీ !
చిరకాలార్జితకర్మల న్నుడుపగా చేకొమ్ము కోటీశ్వరా ! 1

శా ॥ మాయావాగుర జిక్కి దృశ్యమును సంభావించుచున్ భ్రాంతు లై
జాయాపుత్రధనంబులే తమకు రక్షం జేయగా జాలు నం
చేయాశల్ విడబోక నిన్ను గనగా నేతెంచి రీమానవుల్,
చేయూత న్నిడి రక్షజేయ వడిగా చేకొమ్ము కోటీశ్వరా ! 2

మ ॥ ధనధాన్యంబుల నాలుబిడ్డలను సంతాపంబు లేకుండ కో
రిన కోర్కెల్ వడి దీర్చువాడ వని వారిన్ వీరి నెవ్వారినిన్
మనమం దుంచక కొల్వవచ్చి రిదె, సమ్మానంబునన్ జూడ వ
చ్చిన తారల్‌వలె నున్న యాప్రభలతో, చేకొమ్ము కోటీశ్వరా ! 3

శా ॥ ఈయన్ రా రిట కన్య నెవ్వ రని నీ వేవో శ్మశానంబులో
మాయల్ నేర్చియు మాయజేసితివిరా ! మహేశ్వరిన్ దొంగ వై
మాయాజంగమదేవరా ! విడచితే మానంబు మర్యాదలున్
చేయూత న్నిడి రక్షజేయ వడిగా చేకొమ్ము కోటీశ్వరా ! 4

శా ॥ కాయన్ దొల్చినరీతి కాముడు మనఃకాయంబులన్ దొల్చనీ
కాయార్ధంబును జూడకే తలను గంగ న్నిల్పినావే! హరా!
హాయిం గల్గనె యిద్దరుండ మదికిన్, హా నీవు కామారివా !
చేయూత న్నిడి రక్షజేయ వడిగా చేకొమ్ము కోటీశ్వరా ! 5

శా ॥ ఆయెన్ బోయెను, బిచ్చగాడ వభవా ! అర్ధాంగ ! చర్మాంబరా !
ఏయేరీతుల సంచరించెదవో నీ వేకాగ్రచిత్తంబుతో
పాయంజూడక నిల్వరా, నుడివెదన్, ఫాలాక్ష ! భూతాధిపా !
చేయూత న్నిడి రక్షజేయ వడిగా చేకొమ్ము కోటీశ్వరా ! 6

ఉ ॥ శాపము దాపురించె మునిచానల జూచినచూపువెంట నా
త్రోపుల రాపిడుల్ కలిగె ద్రోహుల కిచ్చువరంబుతోన వే
రాపడె నీకరం బటు మరాళవిహారుశిరంబుచేత నా
పాపము లన్ని వచ్చె, విషపాత్రపురూపున కోటిలింగమా ! 7

శా ॥ ప్రారబ్ధంబును వీడలేవు కనగా ప్రాచీను డౌ గాక, ఆ
కారం బెద్దియు లేక లింగ మన నేకాకార మై పుట్టవే !
తేరా ! సొ మ్మన నిచ్చు మిత్రు గనకే దేహీ యనన్బోవవే !
చేరన్ నీపదపద్మసన్నిధికి నన్ జేకొమ్ము కోటీశ్వరా ! 8

ఉ ॥ బిచ్చము నెత్తి, నెత్తి నిలబెట్టి జటల్, పులితోలు గట్టి, నీ
మచ్చను మాపు మంచు మలమాటు మఠంబు గట్టి, గౌరితో
మచ్చిక జేయవచ్చు, మరుమంజులరూపము బుగ్గిజేసి వే
యిచ్చల నిచ్చి భీతి పరు వెత్తినజెట్టివి కోటిలింగమా ! 9

ఉ ॥ యాదవకన్య బోయు కలి, యంబలి ద్రావగ జూడలేక లం
బోదర, గాంగ షణ్ముఖులు, భూధరకన్యక, భృంగి, నందులున్
ఆదర మొప్ప దారి కట నడ్డము వచ్చిరొ యేమొ, పాప మా
మేదకురాలు మ్రాన్పడియు, మేన్విడె జూడవె, రాతిలింగమా ! 10

ఉ ॥ ఆసలతోడ వచ్చితి దిగంబర ! అర్ధము నాడరూపు, నా
వాసనగొట్టునెత్తి, ముదిబారినయెద్దు, కపాలహారముల్,

బాసట భూతసంఘు, మధివాసము చూడగ వల్లకాడు, నా
వాసన వీడె నీభసితవాసన సోకగ, కోటిలింగమా ! 11

ఉ ॥ దూషణ జేసినాడ నని దోషము లెన్నగబోకు శంకరా !
భీషణరోషమున్ గలుగ భీతిలు లోకము లన్ని వెంటనే
దోషము లుండునే కనగ దూషణభూషణ లంటబోని కా
వేషము లేనియెట్టి పరివేషము లుండని కోటిలింగమా ! 12

మ ॥ పలుయజ్ఞంబుల నారితేరినఘనాపాఠీలు నధ్వర్యులున్
గలధౌతాచలవాసు నిన్ను నుతులన్ గావించగా వచ్చినా
రిలకున్ డిగ్గిన నిర్జరావళివలెన్, ఋత్విక్కులున్ భాష్యకా
రులు నీసన్నిధి నిల్చినార లిదె బారుల్ తీరి కోటీశ్వరా ! 13

ఉ ॥ ఆగమరూపదీపితుని, నాశనిరాశలు లేనివాని, స
ద్యోగనిరూఢి నుండుఘనయోగులు, యోగిసమానసాధకుల్
రాగవిదూరులున్, ఋషులు, రాజులు, నాట్యకళాప్రవీణులున్,
త్యాగము గల్గు దాత, లవధాను, లుదాత్తులు కోటిలింగమా ! 14

ఉ ॥ ఆగము లేక దశ్శరభ యం చనువారు త్రిశూలధారులున్
రాగము తాళమున్ లయ విరామ మెరింగిన గాయకోత్తముల్
వేగమునన్ తధింగిణల వీనుల కిచ్చుమృదంగపండితుల్
భోగసుఖంబులున్ బడయపూజ లొనర్తురు కోటిలింగమా ! 15

ఉ ॥ ఆగమశాస్త్రకోవిదులు యాగము జేసి హవిస్సు లీయగా
రాగము నొంది నీవు నమరాగము జూపుదు వంచు నుండి రా
రేగిన పూర్వవాసనలరీతి నడంప నరిందముండ వై
వేగినమానవాళి మది వేదన దీర్చుము కోటిలింగమా ! 16

-- 0 --

# 5. శ్రీ త్రికోటీశ్వర దండకము

శ్రీమ న్మహాదేవ ! శంభో ! శివా ! శంకరా !
దివ్య కైలాస శైలోన్నతశృంగ విభ్రాజిత స్వర్ణ సౌధాంతరావాస !
కాత్యాయనీ భామినీయుక్త, దేదీప్యమానప్రభా! దివ్య సౌందర్య!
లీలావిలాసాది సౌశీల్య సంయుక్త, సన్మోహనాకార ! ఫాలాక్ష,
నందీశ, చండీశ, భృంగీశ, సంసేవితాంఘ్రిద్వయా!
స్పార, విజ్ఞాన సంపూర్ణతావెూఘ, భూతాధిపా ! వ్యాఘ్రచర్మాంబరా ! నందిరాడ్వాహనారూఢ! దక్షాధ్వరధ్వంస! సర్వేశ! శర్వా! భక్తక్లేశనాశా! మదేభేంద్ర చర్మాంబరా, విశ్వవిఖ్యాత గోరాట్తురంగా! కృపాపాంగ, గంగోత్తమాంగా, శుభాంగా, విరాజల్లసద్ధస్త విన్యస్త సారంగ! గౌరీశ!
శ్రీ దక్షిణామూర్తి రూపుండవై యాత్రికూటాద్రియం దొప్పుమీరన్
ప్రభాభాసమానుండవై వెల్గు సర్వేశ! వేవేలు జోహారులున్ జేసి నేడొక్క విజ్ఞాపనన్ జేతు
మో దేవదేవా! సదా మిమ్ము సంకీర్తనల్ జేయు, నింద్రాది దిక్పాలమౌనీంద్రులంబ్రోవగా,
దక్షిణామూర్తి రూపంబునన్ నిల్చి దక్షాధ్వరాలోక్య సంప్రాప్త పాపంబు బాపంగ,
పంచాక్షరీమంత్ర బోధంబు గావింపవే.
నీదుసద్భక్తు సాలంకయాఖ్యున్, దయాశీలి నానందవల్లిన్
దయన్ సిద్ధు మల్లప్ప, నాశంభులింగమ్మనున్, లీల మల్రాజు, రాజాదులన్,
నీ దయాదృష్టి, వీక్షించి రక్షింపవే!
దేవ! సద్భక్తి నీదైన, సత్పాదపద్మంబులన్ గొల్చి, పూజోత్సవాల్ చేయు మాబోంట్లకున్
కొంగుబంగారమై, కంటికిన్ రెప్పవై, కామితార్థంబు లింపొందగా నిచ్చి, కాపాడ రావే.
గజేంద్రాసురధ్వంసి, సారంగపాణీ, మృడానీశ, గంగాజటాజూట, కైలాసవాసా,
భవా, శర్వ, వామార్ధనారీశ్వరా, సర్వలోకాధిపా, పాపవిధ్వంస,
సర్వేశ్వరా, సర్వసంపత్ప్రదా,
భోగభాగ్యాయు రారోగ్య సౌఖ్యంబులన్ గూర్చుచున్ బ్రోవవా
ఎల్లమంద త్రికూటాద్రివాసా! త్రికోటీశ! యోభోగిరాట్హార!
హారాతిధీరా! దయాసార,
మాం పాహి, మాం పాహి, ఈశా,
నమో దుష్టశిక్షా, నమో శిష్టరక్షా, నమో వ్యోమకేశా, నమో పార్వతీశా,
నమో భోగిభూషా, నమో యోగితోషా, నమో దేవదేవా,
నమస్తే, నమస్తే, నమస్తే, నమః.

-- 0 --

# 6. శివతాండవము

కొండమీది దేవుడా కోటీశ్వరయ్యా !
కోటి కోటి దండాలు కోటయ్యదేవరా ॥ కొండ ॥

విభూతిరేఖలకు వేలాది దండాలు !
మెడలోని నాగులకు నాణ్యమైన దండాలు !
నినుమోసే నందికి వంగి వంగి దండాలు !
జాబిల్లి పూవుకు చక్కనైనా దండాలు ॥ కొండ ॥

పాడుగాటి జడలకు పెద్ద పెద్ద దండాలు !
గరళాకంఠానికి ఘనమైన దండాలు !
రుద్రాక్షమాలలకు రమ్యమైన దండాలు !
పులిచర్మధారికి పూలతో దండాలు ! ॥ కొండ ॥

మూడు కొండల స్వామికి మూడుకోట్ల దండాలు !
మూడు కళ్ళ స్వామికి ముచ్చటైన దండాలు !
గంగమ్మ తల్లికి గంపెడు దండాలు !
గౌరమ్మ తల్లికి సాష్టాంగ దండాలు ! ॥ కొండ ॥

వెలిగేటి ప్రభలను తెచ్చేము స్వామి !
పిల్లలతో పాపలతో వచ్చేము స్వామి !
నీ కొండ చుట్టూతా తిరిగేము స్వామి !
రాత్రంతా మేలుకొని ఉండేము స్వామి ! ॥ కొండ ॥

కొండమీది దేవుడా కోటయ్యా దేవరా !
కళ్ళు తెరిచి మావంక చూడవా స్వామి !
చెయ్యెత్తి మమ్ములను దీవించు స్వామి !
కరుణించి మమ్ములను కాపాడు స్వామి ! ॥ కొండ ॥

కోటయ్య దేవరా చేరుకో స్వామి !
చేయూత నిచ్చి ఆదుకో స్వామి !
కొండదిగి రావయ్య కోటయ్యస్వామి !
కరుణించి మమ్మల్ని కాపాడు స్వామి ! ॥ కొండ ॥

--0--

# 7. శ్రీ వీరభద్రస్తవము

తే. గీ. శివుని నిందించువారల శిక్షచేయ భువిని వెలసిన వీరప్రభూత్తముడవు
దక్షకల్పితయజ్ఞవిధ్వంసి వీవ విపులరౌద్రసముద్ర ఓ వీరభద్ర.

తే. గీ. వీర రౌద్రావతారుడే వీరభద్రు చిత్తమున నిల్పి సద్భక్తి సేవచేయు
ధన్యమతికి నభీష్టంబు తానె యొసగు వీరభద్రుండు వరదాన వీరు డెపుడు.

సీ. దక్షాధ్వరంబు విధ్వంసంబు గావింప జన్మ మందిన వీరచక్రవర్తి
దేవతాబృందంబు దీనత్వమును జెంద పాఱద్రోలిన మేటిపౌరుషుండు
విష్ణుచక్రంబు నిర్వీర్యంబు గావించి తపనుదంతము లూడదన్నినతడు
బ్రహ్మాండ మంతయు భయముచే గంపింప గర్జసల్పినయట్టిఘనతరుండు

తే. గీ. ఖడ్గముం బూని సురవీరకంఠములను, నఱకె గుట్టలుగా రక్తనదులు పార
త్రిభువనంబుల శివభక్తి తిరముగొల్పు వీరభద్రుండు శుభదు డై వెలయుగాక

తే. గీ. విశ్వనిర్మాణకారణ, విశ్వరూప, విశ్వసంరక్షణోన్నిద్ర, వీరభద్ర,
కీర్తనీయసుచారిత్ర, కృప దలిర్ప అభయ మీయగ రార ని న్నభినుతింతు.

తే. గీ. అతులితారోగ్యభోగభాగ్యాదికంబు నైహికాముష్మిక సుఖంబు లమరు గాదె.
విశ్వ సౌభాగ్యదాయి యా వీరభద్రు నన్వహము పూజసల్పెడు ననఘమతుల.

# 8. ఖడ్గములు

సీ. అసురుల వేటాడి, అయోధ్యపురి కేగి, రఘునాయకుల బట్టి రాచివైచి,
అర్చుల వెలిగెడి అగ్నిదేవుని బట్టి, కోరేటి నాలుకల్ గోసివేసి,
చెలగి నృసింహుని చెంపలు వాయించి, సిగబట్టి బ్రహ్మను సిగ్గుబఱచి,
గొబ్బున యింద్రుని కోపాన దన్నితే అబ్బరో యని కూలె అవని మీద.

తే. గీ. నీదు మహిమంబు వర్ణింప నెవరి తరము వర్ణితాకార, శంభునివరకుమార
ప్రళయతలరౌద్ర, పరమకృపాసముద్ర, వినుతశతరౌద్ర, మాతంద్రి వీరభద్ర.

సీ. దక్షుడు యజ్ఞంబు దలపెట్టినంతనే బ్రహ్మదేవునిగుండె భగ్గు మనియె
వింటిరా సురలార విన్నపం బొక్కటి కలగంటి యీరాత్రి కల్ల గాదు
మహి మీద పార్వతి మాయ మై చనె నని పరమేశ్వరునివామభాగమునకు
చెమట బుట్టిన దాని చట్రాతి పైనేయ వీరన్న బుట్టెరా విశ్వమునను
వచ్చెరా వీరన్న, గుచ్చెరా చే కత్తి,చొచ్చెరా జనులపై చోద్యముగను

తే.గీ. అనుచు నింద్రుండు వచియించె నౌర, దేవభక్తహృత్సంగ భక్తులప్రాణలింగ
వర్ణితాకార, శంభునివరకుమార, ప్రళయతలరౌద్ర, పరమకృపాసముద్ర.
వినుతశతరౌద్ర, మాతంద్రి, వీరభద్ర. 2

సీ. పలక తాటించెతే పగిలె భూభాగంబు,కులగిరిపర్వతాల్ క్రుంగె ధరలో,
శూల మెక్కించితే సురల గుండెలు పగిలె,నింద్రుడు మూర్ఛిల్లి నేలకొరగె
చక్రంబు త్రిప్పితే క్షితిమీద నొరగిరి రక్కసుల్ మిక్కిలి వక్కలుగను,
మీనంబు వడివేసి మింటిపై జూచితే చుక్క లన్నియు రాలె పిక్కటిల్ల.

తే.గీ. ఔర, వీరాంగ మాడితి వౌర, రుద్ర,
వర్ణితాకార, శంభునివరకుమార,
ప్రళయతలరౌద్ర,విశ్వకరుణాసముద్ర,
వినుతశతరౌద్ర, మాతంద్రి,వీరభద్ర. 3

సీ. పెంపైనవిభూతి పేరు గొన్నప్పుడే నరసింహమూర్తికి నడుము విరిగె,
అడ్డమైనశూలంబు నప్పుడు త్రిప్పితే తెల్లనినామంబు నల్ల నాయె
మొలకరుద్రాక్షలు ముఖమున దాల్చితే తులసిపేరులు తునాతునక లాయె
అప్పుడు వీరన్న ఆయుధ మందితే పువ్వులవానలు భువిని గురిసె.

తే.గీ. ఔర ! మించితి వీరప్రపంచమునను,
వర్ణితాకార, శంభునివరకుమార,
ప్రళయతలరౌద్ర, విశ్వకరుణాసముద్ర,
వినుతశతరౌద్ర, మాతంద్రి, వీరభద్ర. 4

ఛేదించి బ్రహ్మతల చేతను బట్టితో కోపించి బ్రహ్మాండకోట్లు చెదర
కాలమృత్యువు బట్టి కండలు చెండవో ఘన మైన మూడులోకములు బెదర
తలబడి పారవా, తన్నవా డాకాల రూపించి చంద్రునిరొమ్ము పగుల
అక్కడివారిని అదిరించి తోలవా రంగార మూలకు, రంగములుగ.

తే.గీ. ఔర ! వీరాంగమాడితి వౌర, రుద్ర,
వర్ణితాకార, శంభునివరకుమార,
ప్రళయతలరౌద్ర, విశ్వకరుణాసముద్ర,
వినుతశతరౌద్ర, మాతంగ్రడి, వీరభద్ర. 5

సీ. శ్రీమన్మహాదేవ, సృష్టిసంరక్షణా, దక్షాధ్వరధ్వంసి, ధవళవర్ణ,
నందివాహన, ఈశ, నాగేంద్రకేయూర, కందర్పసంహార, కల్పవృక్ష ,
కైలాసగిరివాస, కనకాద్రికోదండ, కారుణ్యానిజభక్త, కవికుమార,
గంధర్వ గీర్వాణ గరుడ కిన్నర, యక్షసిద్ధ విద్యాధర సేవితాత్మ.

తే.గీ. భద్రకాళీమనోహర, భవ్యచరిత, భగ్నలయ, కాలరుద్ర, కృపాసముద్ర,
వర్ణితాకార, శంభునివర కుమార, ప్రళయతలరౌద్ర, విశ్వకరుణాసముద్ర,
వినుతశతరౌద్ర, మాతంగ్రడి, వీరభద్ర. 6

సీ. గదశూల, చక్రంబు, గండ్రగొడ్డలి, విల్లు, అడిదంబు, శూలంబు, అంకుశంబు,
పిడివెంపు, ఝుంఝూళి, బిరుదుపానాకత్తి, బల్లెంబు, శూలంబు, వల్లెత్రాడు,
కొంగవాలపుకత్తి, ఘోరబల్లాణంబు, అంకిణీసెలకోల, అంకుశంబు,
గద, బిరుసుచేకత్తి, గడ్డగోరు, కతారి, సురలతాడనముల సుక్కబఱచి

తే.గీ. మించితివి నీవు ప్రపంచమందు
వర్ణితాకార, శంభునివరకుమార,
ప్రళయతల రౌద్ర విశ్వ కరుణాసముద్ర,
వినుతశతరౌద్ర, మాతంగ్రడి, వీరభద్ర. 7

సీ. కొమరొప్ప బెల్లంబుకొండదేశములోన, పరగణా కోసూరు పట్టణమున,
సరవితో, శార్వరిసంవత్సరమున ఫాల్గుణమాసాన, బహుళమందు,
శుభయోగ మష్టమి శుక్రవారమునాడు, నుదయాది మీనముహూర్తమందు
ఆలోన ముప్పదిదినములలో నాడుముద్రాల పాపయ్య ముదముతోడ.

తే.గీ. భక్తి మెప్పించి భక్తుల ప్రస్తుతించి
అందె తొడిగించె పాదాన పొందుగాను
ప్రళయతలరౌద్ర, విశ్వకరుణాసముద్ర,
వినుతశతరౌద్ర, మాతంగ్రడి, వీరభద్ర. 8

సీ. పచ్చని కురువేరుపై నున్న విభూతివన్నెవస్త్రముచేత వీరపలక
కుడిచేత నరకంగ పెడబొబ్బ పెట్టంగ దక్షయాగం బెల్ల తల్లడిల్లె
దక్షయాగమునకు దరలుటే చే టని మూగిరి దేవతల్ మూల మూల
కోటానుకోట్లను వేట్లు పడ కొట్టంగ వరద లై రక్తంబు వాగుబార.

తే. గీ. మించితివి నీవు వీరప్రపంచమందు
వర్ణితాకార, శంభునివరకుమార,
ప్రళయతల, రౌద్ర, పరమకృపాసముద్ర ,
వినుతశతరౌద్ర, మాతంగ్రడి, వీరభద్ర. 9

# 9. ఆనకట్టు

సీ. శ్రీవీరభద్ర, యాశ్రితజనావనముద్ర, పాపవిశోష, సద్భక్తపోష ,
దక్షయాగ విదూర, దానవసంహార, కరవాలహస్త, లోకప్రశస్త,
బ్రహ్మాండదుర్భల, సింహనాదవినోద, విఖ్యాతసత్కీర్తి, విమలమూర్తి,
బాణ, బాణాసన, పరశు, గదా, చక్ర, ముసల, ముద్గర, శూల ముఖ్యహస్త,
భక్తితోడుత, మాపు పళ్లెంబు బెట్టెద, బూని యాప్రొద్దు విభూతి విడెము,
గంధపుష్పాక్షతల్ కడుభక్తి తెస్తిమి, గృప యుంచి దేవ, పరిగ్రహించి,
పళ్లెంబు చెల్లించుపర్యంతమును మీరు, నిజనివాసంబున, నిలువవలయు,
వేట బోవలె నని వేంచేయుగా బోకు, దండు ఠాణమునకు, తర్లబోకు,
పోయిన మీతండ్రి కాయజహరునాన, మీరిన మీయమ్మగారి యాన,

గీ. పరమవిశ్వాస, సద్భక్త, పరులయాన.
యనుచు సాష్టాంగదండంబు లమర నిడుదు,
మ్రొక్కు దీరిన ముద మిచ్చు ముదము నొంది
భద్రకాళీమనోహర, భవవిదూర,
వినుతశతరౌద్ర, మాతంగ్రడి వీరభద్ర.

-- 0 --

# 10. శ్రీ వీరభద్ర దండకము

శ్రీవీరరూపా, శివద్రోహగండా, ప్రచండప్రతాపా,
సుపర్వాణసంఘుతమెూభానుబింబప్రదీపా, మహాకోపరూపాదివీరాంక, వీరా,
పురారాతిసంహార, ఘోరావతారా, శివాచారమందార, బృందారకాధీశగర్వాపహారా,
దయాకార, నాగేంద్రహారా, సనందాదియోగీంద్రచేతోవిహారా, జనాధార,
నీదివ్యతత్త్వంబు భావింపగా లేక గర్వాంధకారాంధు లేమైతిమో
నీదురూపంబు రూపింప నజ్ఞానబంధంబులం జిక్కి-
వేద ప్రకారంబులన్ మీంచి యిచ్చోటికిం దక్షయాగంబు వీక్షింపగా నున్న
మారాక యెల్లం గడుం దప్పు లై యుండు సైరింపవే, దేవదేవా,
శివద్రోహు లైనట్టి మమ్ము విజృంభించి శిక్షించి,
తీ వింక నీ దైన వైరంబు చాలింపు తండ్రీ మముం గూర్చి, మే మెంతవారమ్ము
నీ యానతిం గాదె యీ బ్రహ్మ లోకంబులం బ్రాణనిర్మాణు డై యుంట
నీ యానతిం గాదె యీ విష్ణులోకైక రక్షాభుజాదక్షు డై యుంట
నీయానతిం గాదె రుద్రుండు సర్వప్రపంచారి యై యుంట
నీయానతిం గాదె రేయుం దినంబుల్ వెలుంగొందుచుం
జంద్రసూర్యాదులున్ భవ్యు లై యుంట,
నీయానతిం గాదె దేవేంద్రనాగేశముఖ్యుల్ ప్రతాపించి దిక్పాలు రై యుంట
నీయానతిం గాదె దేవౌఘముఖ్యుల్ సులోకోపరార్థు లై యుంట
నీయందు గాదె సరోజాతజాతాండముల్ దొంతు లై యుంట
నీయున్న చందంబు నే మెంత యూహింప గా వచ్చు
వేదంబులు న్నీవ, వాదంబులు న్నీవ, ధైర్యంబులు న్నీవ, మర్మంబులు న్నీవ,
యీబ్రహ్మయు న్నీవ, యీవిష్ణువు న్నీవ, యీ రుద్రుడు న్నీవ ,
సర్వంబును న్నీవ, సుమ్మీ జగన్నాథ, నీ పెంపు నీకుం దలంపగ జిత్రంబు
మాబోటివా రెల్ల నిన్ను విచారింపగా నేర్తురే
నీవు కారుణ్యదృష్టిం బ్రసన్నుండ వై, వీరు నావారు, నాదాసు లంచున్
ముదం బొప్ప మన్నించి దివ్యప్రభోదప్రసాదంబులం జేసి రక్షింపగా
నీకు భారంబు గాకుండ నజ్ఞానభావంబులం బాపి, సుజ్ఞానమార్గంబులం జేసి,
నిష్కర్ము లై, నిత్యసమ్మోదు లై, యేకచిత్తంబునం బొంది, నిర్వాణు లై ,
నిష్కళంకంబులం బొంది, మిన్నంది, మీయందు భావంబు గీలించి,

నీదివ్యరూపంబు దా నెట్టిదో గాక యంచుం దలంపొంది భావించువా రెల్ల
దృగ్గోచరం బైన ని న్నేర్పడం గానగా లేక విభ్రాంతు లై చీకువడ్డార
మిం దేనిమిత్తంబునం జేసి
నీచందము, న్నీవిలాసంబులు, న్నీదురూపంబునుం జూచియును,
న్నీవు చేజేత దండించు పుణ్యంబులు న్బొందగల్గన్
మహాధన్యుల మ్మైమ్రతి మోదేవ, దేవాదిదేవా, మహాదేవ,
నీలెంక లైనట్టి, నీదాసు లైనట్టి, మమ్ముం దయాళుండ వై, ప్రీతి రక్షింపవే దేవ,
వీ రెవ్వరుం గానగా లేరు, నేరంబు సైరింపవే , దేవ , మన్నింపవే దేవ,
శ్రీవీరభద్రా, శరణ్యంబు రుద్రా, నమ స్తే, నమ స్తే, నమ స్తే, నమః.

# 11. శ్రీ వీరభద్ర మంగళాష్టకము

నందాద్రివసతే ఉనంత - నాగయజ్ఞోపవీతినే
సుందరాత్మ స్వరూపాయ - వీరభద్రాయ మంగళమ్ !!

భద్రకాళీశ్వరా యాస్తు - భర్గాయ నిజరక్షిణే !
నిద్రాలస్య ప్రమాదాది - రహితాయ సుమంగళమ్ !!

భక్తకామ్య ప్రదాయాశు - భుక్తి ముక్తి ప్రదాయినే
సూక్తి ముక్తాఫలాస్యాయ - వీరభద్రాయ మంగళమ్ !!

భూతారిష్ట వినాశాయ - భూతి భూషాయ శంభవే
దక్షయాగ ధ్వంసకాయ - వీరభద్రాయ మంగళమ్ !!

దేహదార్ఢ్య నిదానాయ - గేహసౌఖ్య ప్రదాయినే
మోహాదివేగ నాశాయ - వీరభద్రాయ మంగళమ్ !!

గణాధిపాయ కైలాస - శిఖరాగ్ర నివాసినే
ప్రాణేశ్వరాయ రుద్రాయ - వీరభద్రాయ మంగళమ్ !!

నాగభూషాయ దేవాయ - నానావంధ్యత్వహారిణే
భోగాధిపతయే తుభ్యం - వీరభద్రాయ మంగళమ్ !!

రామనాథ సుతేడ్యాయ - భీమవిక్రమ కారిణే
కామపూర్ణ స్వరూపాయ - వీరభద్రాయ మంగళమ్ !!

నమస్తే దేవదేవేశ - నమస్తే కరుణానిధే
నమస్తే జగతాంనాథ - నమస్తే విశ్వమూర్తయే !!

-- 0 --

# శ్రీశివార్చనం - శివవైభవం

## శివస్వరూపవివరణ

శివుడికి ఆశుతోష డని పేరు. ఈమాటకు వెంటనే సంతోషించేవా డని అర్థం. త్రిమూర్తుల్లో శివుడు త్వరగా ప్రత్యక్షమై వరాలిస్తా డని భక్తులవిశ్వాసం. ఆయన రూపమూ వ్యవహారమూ గూడా విచిత్రమే. కట్టుకోడానికి వస్త్రం గూడా లేని వాడు. గజచర్మాన్ని ధరించేవాడు - దిగంబరుడైనా ఎవరికయినా ఐశ్వర్యా న్నిచ్చేది ఈశ్వరుడే. దిగంబరు డంటే దిక్కులే వస్త్రంగా కలవాడు. సర్వవ్యాపి అని కూడ అర్థం చెప్పవచ్చు). ఇలాంటివిచిత్రాలు కలవాడు కనుకనే ఆయన మహత్తు వేదాలు మొదలు పురాణాలదాకా వ్యాపించి ఉంది. భారతంలో కూడా ఎన్నో చోట్ల శివప్రశంస, ఈశ్వరమాహాత్మ్యము కనిపిస్తవి. భారతం మొత్తంమీద విష్ణుసహస్రనామాలు ఒక్కమారే కనిపిస్తే శివసహస్రనామాలు వేరువిధాలుగా రెండుచోట్ల కనిపించడం విచిత్రం. సంస్కృతభారతంలో ద్రోణపర్వంలో శతరుద్రీయ మనేపేరుతో నమక చమకాల్లో వచ్చే ఎన్నో మంత్రాలు శ్లోకరూపంలో కనిపిస్తవి. సస్వరంగా నమకచమక పారాయణ చేయలేని వాళ్లు శతరుద్రీయ శ్లోకాలు చదువుకొని ఫలితం పొందవచ్చు. శివారాధన చేయడానికి ధనవ్యయం చేయవలసిన పనిలేదు. కేవలం నీళ్ళతో అభిషేకం చేసి ఆయన అనుగ్రహపాత్రులం కావచ్చు. ఇదే శివానుగ్రహవిశేషం. ఒకవిధంగా చూస్తే శివుడు నిరాకారానికి సాకారానికి గూడ ప్రతీకగా భావించవచ్చు. విష్ణువులాగా శివుడు కరచరణాద్యవయవరూపంలో పూజార్హుడు కాడు. కేవలం లింగరూపంలో మాత్రమే అర్చనార్హుడు. లింగరూపంలో కరచరణాద్యవయవాలు లేవుకనుక అది నిరాకారానికి ప్రతీకగా చెప్పవచ్చు. లింగానికి ఒకరూపం ఉంది గదా అనుకుంటే సాకారరూపంగా భావించవచ్చు. శివారాధన కేవలం లింగరూపానికే గాని ప్రతిమకు కాదు. ఈశ్వరుని ప్రతిమరూపంలో అర్చిస్తే పొందేఫలితం స్వల్పమాత్రమే నని వ్యాసమహర్షి అశ్వత్థామకు వివరించిన విషయాన్నిబట్టి తెలుస్తుంది. అలానే శివవిష్ణువులకు భేదం లేదని వారిలో ఎక్కువ తక్కువలు లేవని ద్రోణపర్వాన్ని బట్టి గ్రహించవచ్చు.

శివుడిలో అర్ధభాగం అయిన పార్వతే శివుడినిగురించి ఎన్నో సందేహాలు కలిగితే ఆయనని ప్రసన్నం చేసుకొని సందేహనివృత్తి చేసుకొంది. ఈ విషయం గూడా ఆనుశాసనికంలో కనిపిస్తుంది. మరికొన్నిచోట్ల మరికొన్నివిషయాలు గోచరిస్తాయి.

ఒకనాడు పార్వతి శివుడితో హాస్యమాడుతూ వెనుకనుంచి రెండు కళ్ళు మూసింది. వెంటనే శివుడు మూడవకన్ను తెరిచాడు. దానిలోనుంచి వచ్చిన అగ్ని హిమాలయ మంతా కప్పివేసింది. పార్వతిప్రార్థనతో అగ్నిని ఉపశమింపజేశాడు శివుడు. ఇలా ఎందుకు చేశా వన్నది పార్వతి. శివుడు నాకు లోకాత్మకత్వ మున్నది. అందువలన నీవు కళ్ళు మూస్తే సర్వలోకాల్లో ఆవరించినచీకటిని వారించడానికి మూడవకన్ను తెరిచా నన్నాడు. ఆయనకళ్ళు రెండు సూర్యచంద్రు లని మూడవకన్ను అగ్ని అని గ్రహించవచ్చు. కావాలనుకొంటే శివుడు మూడవకంటినుంచి చల్లదనాన్ని కల్పించగలడు.

పార్వతి శివుడిని నీకు నాలుగుముఖాలు కలగడానికి కారణ మే మన్నది. శివుడు శక్తివంతు లయిన సుందోపసుందు లనే రాక్షసుల వినాశనానికి మయుడు లోకంలో ఉన్న అంద మైన వస్తువు లన్నింటినుంచి తిలప్రమాణం - నూవుగింజంత గ్రహించి తిలోత్తమ అనే అందగత్తెను సృష్టించాడు. ఆమెను నాదగ్గరకు తెచ్చాడు. ఆమె నాకు ప్రదక్షిణం చేస్తుంటే ఇది దేవకార్యం చేయబోతున్న దన్న ఆలోచనతో ఆమె తిరుగుతున్న దిక్కునల్లా ఒక్కొక్క ముఖం ధరించాను. అప్పటినుండి నాలుగు ముఖాలు కలిగిన వన్నాడు.

నీకంఠానికి నలుపు ఎందుకు కలిగిం దని పార్వతి ప్రశ్న. పాలసముద్రం చిలికినప్పుడు కలిగిన హాలాహలం బ్రహ్మాదిదేవతలకోరికతో కంఠంలో ధరించాను. అప్పటినుంచి కంఠం నలుపై నీలకంఠుడి నైనా నని శివుడిసమాధానం.

అన్ని ఆయుధాలకన్న నీకు పినాకం - శివుడిధనస్సు పేరు - మీద మక్కువ ఎక్కువ ఎందు కని పార్వతి అడిగినదానికి సమాధానంగా శివు డిట్లా వివరించాడు. కలియుగంలో కణ్వు డనేఋషి తపస్సు చేస్తుంటే ఆయనచుట్టు పుట్ట పెరిగింది. ఆపుట్టలో ఒకపెద్దవెదురుగడ పుట్టింది. బ్రహ్మ ఆయనకు వర మిచ్చి ఆ వెదురు గడను పినాకం, శార్‌ఙ్గం, గాండీవం అనే మూడు ధనస్సులుగా చేసి శార్‌ఙ్గం

విష్ణువుకు, పినాకం నాకు ఇచ్చి గాండీవం తనదగ్గర ఉంచుకున్నాడు. అందువల్లనే పినాకం నాకు చాలా ఇష్ట మైంది.

ఇతరవాహనాలు కా దని ఎద్దునే ఎందుకు వాహనం చేసుకొన్నా వన్నది పార్వతి. నేను లోకహితంకోసం హిమాలయాలమీద తపస్సు చేస్తుంటే ఆవులు నా చుట్టు తిరిగి ఇబ్బంది పెడుతుంటే కోపించి చూశాను. ఆవులు సంతాపం పొందేయి. బ్రహ్మ, దేవతలు నన్ను ప్రార్థించి నాకు ఎద్దు కానుకగా ఇచ్చారు. దాన్ని వాహనంగాను, కేతనంగాను చేసుకొని గోపతి అని పేరుపొందే నన్నాడు శివుడు. మరోచోట మరో విషయం గూడ కనిపిస్తుంది. ఒకఆవు దానిలేగకు పాలిస్తున్నది. లేగనోటిలోనుంచి వచ్చిన పాల నురుగు తపస్సు చేస్తున్న శివుడిమీద పడింది. ఆయన కోపంగా ఆవును చూస్తే అది నల్లబడింది. దేవత లందరి ప్రార్థనమీద శివుడు ఆవుదూడను వాహనంగా చేసుకొని ఆనాటినుంచి నల్లఆవుకు కపిల అని పేరుపెట్టి ఆవు లన్నిటిలో కపిల శ్రేష్ఠ మని వరమిచ్చాడు.

నీవు రమణీయమైన, శుచియైన ప్రదేశాలు వదలి శ్మశానంలో ఎందు కుంటున్నా వన్నది పార్వతి. శివుడి సమాధానం ఇది. ఒకప్పుడు క్రూరభూతాలు జనులను ఘోరంగా హింసించడం ప్రారంభించాయి. వాటికి ప్రతీకారం చెయ్యమని ప్రార్థించాడు బ్రహ్మ. మోక్షం కోరేవాళ్ళు శుచిగా భావించేదీ, జనాలు ఉండనిదీ అయినశ్మశానం నానివాసం చేసుకొని భూతాలను అదుపులో ఉంచుతున్నాను. బూడిదపూత, సర్పాభరణాలు, గంగ్రద్గొడ్డలి, త్రిశూలంతో భీకరరూపం ధరించడానికి కారణ మే మన్నది పార్వతి. లోకస్వరూపం ఉష్ణ మని, శీత మని రెండు విధాలు. వీటినే సౌమ్యము, ఆగ్నేయము, అంటారు. విష్ణువు సౌమ్యరూపాన్ని, నేను ఆగ్నేయరూపాన్ని ధరిస్తాము. అందుకే నాకిట్లాంటి రూపము అన్నాడు శివుడు.

నెలవంకను శిరసుమీద ధరించడానికి కారణ మే మన్నది పార్వతి. దక్షయజ్ఞంవల్ల కలిగినకోపంవల్ల దేవతలను హింసిస్తూ చంద్రుడిని కాళ్ళక్రింద వేసి త్రొక్కేను. చంద్రుడు శరణుకోరితే దయ తలచి అప్పటినుంచి నెత్తిమీద ధరించా నన్నాడు శివుడు. వ్యాసమహర్షి ప్రజలసందేహాల్ని పార్వతి ప్రశ్నలుగా చేసి శివుడి చేత సమాధానం చెప్పించడం విశేషం.

శివ మస్తు.

# శైవసిద్ధాంతము - శైవాగమాలు

-శ్రీవిద్యాస్వరూపానందగిరి స్వాములవారు

ఓం నమో భగవతే శ్రీమలయాళయతీంద్రాయ !

సృష్ట్యాదినుండి ఏదో ఒకఅద్భుతశక్తి సదా సర్వత్ర పని చేస్తుండడాన్ని మనం ప్రత్యక్షంగా చూస్తున్నాము. అది అఖండం. ఆశక్తే పరమాత్మ. ఆశక్తే భగవంతుడు, పరమేశ్వరుడు, అతడు సచ్చిదానందస్వరూపుడు, స్వయంప్రకాశుడు, సర్వతంత్ర స్వతంత్రుడు, త్రికాలాబాధ్యుడు. పరిణామరహితుడు, సర్వజ్ఞుడు, సర్వవ్యాపి, సర్వాంతర్యామి. ఈశావాస్య మిదగ్ం సర్వం అంటూ ఈవిషయాన్నే ఈశా వాస్యోపనిషత్తు తెలిపింది. కఠోపనిషత్తున్ను ఏష సర్వేషు భూతేషు గూఢాత్మా న ప్రకాశతే అంటూ భగవంతునిసర్వవ్యాపకతను ప్రతిపాదించినది. శ్వేతా శ్వతరోపనిషత్తు గూడ ప్రతిప్రాణిలో ఒకే పరమాత్మ ప్రకాశమానుడై, సర్వవ్యాపకుడై, సర్వభూతాంతరాత్మయై, సర్వకర్మాధ్యక్షుడై, సాక్షిమాత్రుడై, చేతనుడై, కేవలుడై, నిర్గుణుడై, గూఢంగా వున్నాడు అంటూ విశదీకరించింది.

ఆభగవంతుడే సృష్టి-స్థితి -లయములకు కర్తయై బ్రహ్మ-విష్ణు ... డనబడినాడు. ఆభగవంతునికి గలఅనంత రూపాల్లో, పేర్లలో-శివుడు, పరమేశ్వరుడు, ఈశానుడు మొదలైనవి కొన్ని. నిర్గుణుడు, సర్వవ్యాపి, సర్వశక్తిమంతుడగు భగవంతుని పొందాలంటే-సాక్షాత్కరించుకోవాలంటే అతని నామాన్ని ఆశ్రయించి దానిని జపించడం సులభమార్గం. మననాత్ త్రాయత ఇతి మంత్రః - భగవన్నామము తనను జపించువానిని సంసారదుఃఖంనుండి తరింపజేస్తుంది కాన మంత్రం అనబడింది.

ఇట్టిమంత్రాలలో నమ శ్శివాయ అనే పంచాక్షరీమంత్రం శ్రేష్ఠమైంది. ఈవిషయాన్నే శ్రీ రేణుకాచార్యులవారు అగస్త్యమునికి **శివతత్త్వా త్పరం నాస్తి యథా తత్త్వాన్తరం మహత్** అంటూ పంచాక్షరీ మంత్రం సర్వశ్రేష్ఠమని చెప్పియున్నారు. మఱియు **అశేష జగతాం హేతుః పరమాత్మా మహేశ్వరః. తస్య వాచకమంత్రో** యం సర్వమంత్రైకకారణమ్. ఎట్లు సమస్తజగత్తులకు పరమాత్మ యైన మహేశ్వరుడు కారణమో అట్లే ఆమహేశ్వరునినామ మగు నమ శ్శివాయ అను పంచాక్షరీ మంత్రమున్ను అన్ని మంత్రాలకు మూలము అని చెప్పి యున్నారు.

అంతే గాక - **ఆదితః పరిశుద్ధత్వాత్, మల(త్రయ వియోగతః శివ ఇ త్యుచ్యతే. శంభు శ్చిదానందఘనః (ప్రభుః-** ఆదినుండి అణవాదిమలములు లేనివాడై పరిశుద్ధు డైనందున అన్నింటికి ప్రభువు, సచ్చిదానందఘను డగు శంభుడు శివ అని చెప్పబడుచున్నాడు. మఱియు **ఆస్పదత్వా దశేషాణాం మంగళానాం విశేషతః ! శివశబ్దాభిధేయో హి దేవదేవ స్త్ర్యంబకః.**

సమస్తశుభాలకు విశేషస్థానమైనందున దేవతల కెల్ల దేవు డగుత్ర్యంబకుడు శివుడు అనుపేరుతో పిలువబడుచున్నాడు.

ఇట్టి శివ అనే రెండక్షరాలు గల భగవంతునినామము శివ ఇ త్యక్షరద్వంద్వం పరబ్రహ్మ ప్రకాశకం. పరబ్రహ్మను తెలియజేయుచున్నది. కాబట్టి తస్మా న్ముఖ్యతరం నామ శివ ఇ త్యక్షరద్వయం, సచ్చిదానందరూపస్య శంభో రమితతేజసః ॥ శివ ॥ అను రెండక్షరముల ఈపదము సచ్చిదానందస్వరూపుడైన, అతితేజస్వియైన పరమేశ్వరుని నామములలో కెల్ల ముఖ్యాతిముఖ్యము. నమ శ్శివాయ అనే పంచాక్షరీ మంత్రాన్ని మోక్షాన్ని కోరేవారు శ్రద్ధతో ఆదరంతో సదా జపించా లని రేణుకాచార్యు లంటున్నారు. యథా వాది ర్మహాదేవః సిద్ధ పాపమోచకం! తథా పంచాక్షరీమంత్రం సంసారక్షయసిద్ధిః ॥ ఈపంచాక్షరీ మంత్రం సంసారాన్ని నాశనం చేసి మోక్షా న్నిస్తుంది అని అంతే గాక పంచాక్షరి మిమాం విద్యాం ప్రణవేన షడక్షరీం యజే త్సమాహితో! భూత్వా శివపూజాపరాయణః. శివపూజాపరాయణుడు ఈప్రణవ సహితపంచాక్షరీ మంత్రాన్ని ఏకాగ్రచిత్తంతో జపించాలి. అంటూ నిర్దేశించాడు. జ్యోతిష్టోమాది ద్రవ్యయజ్ఞాలు ఈ జపయజ్ఞఫలితంలో 16వ భాగఫలితానికి సమం కావు. ఈ విషయాన్నే యావంతః కర్మయజ్ఞా ద్యా వ్రతదానతపాంసి చ సర్వే తే జపయజ్ఞస్య కలాం నార్హంతి షోడశీమ్ అన్నది శైవాగమశాస్త్రం.

శైవసిద్ధాంతం వైదికయుగం-(వేదకాలం) నుండే వుంది. ఇది భారతదేశ మందంతటా వుండినది. దీనికి హరప్పా, మొహంజొదారో త్రవ్వకాలలో చిక్కిన బహుముఖ శివుడు యోగాసనశివుడు మొదలైన అవశేషాలే సాక్ష్యం, కాలక్రమేణ ఆర్యుల ప్రాబల్యం వలన శైవ సిద్ధాంతం ఉత్తరభారతదేశాన్ని వదలి దక్షిణభారతదేశంలో విశేషంగా ప్రబలింది. తత్రాపిశుద్ధ ద్రావిడ మైన అరవ-తమిళదేశంలో శైవసిద్ధాంతం పేరిట ఇది బాగా వ్యాప్తి చెందింది. కాబట్టే ఈ సిద్ధాంత ప్రతిపాదక గ్రంథాలు తమిళంలో బహుళంగా వున్నాయి. ఈశైవాగమాలు 28. వీని నామనిర్దేశం (పేర్లవివరణ) కంచియందలి శివాలయంలోని శాసనంలో వుంది.

ఈశైవాగమంలో పాశుపతము, శైవసిద్ధాంతం, త్ర్యభిదర్శనం అనే మూడు శాఖ లున్నాయి. పాశుపతానికి నకులీశపాశుపతదర్శనం అని కూడ పేరు వుంది. ఈపాశుపతానికి పాశుపతసూత్రములు మూలగ్రంథం, దీనిరచయిత నకులీశుడు. దీనికి రాశీకరుడు వ్యాఖ్యానం వ్రాశాడు. ఈవ్యాఖ్యానానికి పంచార్థభాష్యం అని పేరు. 1. కారణం, 2. కార్యం, 3. యోగం, 4. విధి, 5. దుఃఖాంతం అనుపదార్థాలు నిరూపించబడ్డాయి. అంచేత దీనికి పంచార్థభాష్య అనేపేరు వచ్చింది. పతి అంటే ఈశ్వరుడు, పశు అంటే జీవుడు-ప్రాణి, పాశము అంటే సంసారము ప్రపంచము. ఈమూడింటి తత్త్వాన్వేషణే ఈపాశుపతమందలి ప్రధానవిషయం. పశు, పతి, పాశం అనే మూడింటిని శైవసిద్ధాంతలో త్రికం అంటారు.

ఈశైవసిద్ధాంతం 1. ప్రత్యక్షం, 2. అనుమానం, 3. శ్రుతి అనే మూడు ప్రమాణాలను అంగీకరిస్తుంది. ఇందు శ్రుతి అనే ప్రమాణంలో వేదాలు, ఉపనిషత్తులు, భగవద్గీత, ఇరవైఎనిమిది శైవాగమాలు వస్తవి. ఇందు 1. కామికాగమము, 2. యోగజాగమము, 3. చింత్యాగమము, 4. కారణాగమము, 5. అజితాగమము, 6. దీప్తాగమము, 7. సూక్ష్మాగమము, 8. సహస్రాగమము, 9. అంశుమదాగమము, 10. సుప్రభేదాగమం అనేపది మూలాగమాలు. ఇవి ఈశ్వర ప్రోక్తా లనీ 1. విజయాగమం, 2. అనిశ్వాసాగమం, 3. స్వాయంభువాగమం, 4. వీరాగమం, 5. రౌరవాగమం, 6. మకుటాగమం, 7. మలాగమం, 8. చంద్రజ్ఞానాగమం, 9. బింబాగమం, 10. ప్రోద్గిణీతాగమం, 11. లలితాగమం, 12. సిద్ధాగమం, 13. శాంతాగమం, 14. సర్వోత్తరాగమం, 15. పారమేశ్వరాగమం, 16. కిరణాగమం, 17. ఆనలాగమం, 18. వాతూలాగమం, అనే పద్దెనిమిది రుద్రాగమాలు. ఇవి మనుష్య సంపాదితాలని, అంటారు. వీనన్నింటిసారమే పౌష్కరాగమము. తమిళనాడులోని శైవసిద్ధాంతసంప్రదాయంవారు కర్ణాటకలోని వీరశైవ సంప్రదాయంవారు, కాశ్మీరులోని ప్రత్యభిజ్ఞా సాంప్రదాయికులు ఈ 28 శైవాగమాలను ప్రమాణాలుగా అంగీకరిస్తారు.

ఈశైవాగమా లన్నీ ప్రతి ఒక్కొక్కటి 1. చర్యాపాదం, 2. క్రియాపాదం, 3. యోగపాదం, 4. జ్ఞానపాదమని నాలుగుపాదాలు కలిగి వున్నాయి. ఈ నాల్గుపాదాల్లో జ్ఞానపాదం చాలా ముఖ్యం. పశువు అనబడే జీవుడు బద్ధుడైనదశలో

ప్రపంచంతో అనురాగం గల్గి దానిలో లీనమౌతున్నాడు. అదే బద్ధదశ. ఆజీవుడే పాశంతో ప్రపంచంతో సంబంధాన్ని వదలి పతి యగు శివునితో సంబంధం పెంచుకొని అద్వైతస్థితిని పొంది ముక్తు డవుతున్నాడు. పశు అనుజీవుడు పతి అనబడే పరమేశ్వరుని కృపావిశేషంచేత పాశచ్ఛేదం చేసుకొని పరమేశ్వరుని పాదసన్నిధిలో శాశ్వతానందాన్ని పొందుతాడు.

శివుడు ఇంద్రియగోచరుడు కాదు. భక్తుడు తనఆధ్యాత్మిక తత్త్వానుభవంచేత శివుని గుర్తించాలి. దానికి తార్కికపద్ధతి పనికిరాదు అంటాడు జ్ఞానసంబంధర్. శివతత్త్వం 1. నిష్కళాతత్త్వం (పరమేశ్వరతత్త్వం) 2 సకలాతత్త్వం అని రెండు విధాలు. మొదటిదైన నిష్కలాతత్త్వాన్ని స్వరూపలక్షణ మనీ, రెండవదైన సకలాతత్త్వాన్ని తటస్థలక్షణ మనీ అంటారు. నిష్కలాతత్త్వం వాక్కుకు, మనస్సుకు, క్రియకు గోచరం కానిది. ఈశ్వర కరుణావిశేషంచేత పరిణతజీవులకు జ్ఞానగోచరమై ముక్తినిస్తుంది. శివతత్త్వం జీవులను కర్మముక్తులను చేయుటకై సృష్టి-స్థితి-సంహార-తిరోధాన -అనుగ్రహము అను అయిదు క్రియాకలాపములందు ప్రవర్తింప జేస్తోంది. ఈ క్రియా కలాప మంతా శివునికరుణావిశేషంచేత జీవులను ముక్తులన్నుగా చేస్తుంది.

శైవసిద్ధాంతంలో కార్య క్రమసంబంధం ప్రధానసూత్రం. కార్యానికి సాధారణ కారణాలు 1.నిమిత్తకారణం, 2. ఉపాదానకారణం, 3. సహకారికారణం అని మూడు విధాలు. ఈసృష్టికి శివుడు నిమిత్తకారణం, శక్తి సహకార కారణం, మాయ ఉపాదాన కారణం, ఇందులో సృష్టికి శివుడు కేవలం నిమిత్త కారణ మని ప్రతిపాదించడం ఈ సిద్ధాంతముఖ్యవిషయం. శివుడు లేనిదానిని సృష్టించడు. ఉన్నదానిని నశింపజేయడు. సిద్ధాంతం ప్రకారం పదార్థం నశించదు. అది అవసరాన్నిబట్టి రూపాంతరాన్ని పొందుతుంది.

శివతత్త్వం కార్యాచరణకాలంలో శక్తితత్త్వంతో కూడి వుంటుంది. ఈశక్తి తత్త్వం శివుని ఇచ్ఛాశక్తికీ, జ్ఞాన శక్తికీ ప్రతినిధి. ఇది శివునితో అవినాభావసంబంధం గలది. నిరంతరప్రయత్నంలో జీవితకాల మంతా సాధన చేస్తే జీవులకు మోక్షం లభిస్తుంది. ఈసాధన ఒక క్రమంలో జరగాలి. దానికి నాల్గు దశలు. 1. చర్య, 2. క్రియ, 3. యోగం, 4. జ్ఞానం అని ఈ నాల్గు దశలతో మోక్షం పొందాలంటే దానికి దీక్ష అవసరం.

సాధన నాల్గు దశలు :

**1.** చర్య : చర్య అంటే సేవ. శివుని పత్రపుష్పాదులతో పూజించడం **చర్య** అనబడుతుంది, ఇది ప్రాథమికదశ. దీన్ని దాసమార్గం అంటారు.

**2.** క్రియ : క్రియ అంటే శివుని సాకారునిగాను, నిరాకారునిగాను **భావించి సేవ** చేయుట. దీనిని సత్పుత్రమార్గ మంటారు. దీనిలో మంత్రోచ్చారణ **ప్రధానం.** ఇందు క్రియ పంచాక్షర్యాది మంత్రజపంచేత జీవుని మంత్రార్థం వైపు **మళ్ళిస్తుంది.**

**3.** యోగం : ఇది జీవుడు తనశరీరంలోనినాడీమండలజ్ఞానాన్ని పొంది ప్రవర్తించు విధము, సాధకుడు కామ క్రోధాదుల నన్నింటిని జయించి ప్రాణు లందరిని ప్రేమిస్తేనే ఈయోగం లభ్య మవుతుంది.

**4.** జ్ఞానం : ఇది కడపటి సాధన. ఇచట జీవుడు తురీయాతీతావస్థలో ప్రవేశిస్తాడు. దీనిద్వారా జీవునికి శివునిసాయుజ్యం కల్గుతుంది. శివసాయుజ్యమే ముక్తీ, మోక్షం, భక్తి వీటన్నింటికి మూలం. ఈశైవసిద్ధాంతాన్ని తమిళకర్ణాటక రాష్ట్రాలలో మఠాధిపతులు బాగా రక్షించారు.

కాశ్మీర శైవము :

శైవమతం అతిప్రాచీనం అని కొందరిమతం. ఇది వేదకాలం నుండే వుంది, కాబట్టి దీనిని శైవాగమం అన్నారు అని వీరి వాదము. ఈశైవమతంలో శివాద్వైతం, విశేషాద్వైతం, వీరశైవం, పాశుపతం మొద లగుశాఖలు గలవు. అందు కాశ్మీరదేశంలో ప్రసిద్ధ మైనశైవం శైవాద్వైతం లేక శివాద్వైతం అని, ప్రత్యభిజ్ఞాదర్శనమని, స్పందవాద మని, త్రికదర్శన మని అనబడినది. శైవాగమాలు ఈశ్వరుని ఐదుముఖాలనుండి వెలువడిన వని శైవులవిశ్వాసము. ఇవి 25. ఇవిగాక కాశ్మీర శైవంలో ప్రత్యభిజ్ఞా దర్శనం, స్పందదర్శనం అని మరి రెండు గలవు. వీటికి చెందిన ఆగమాలు ఎనిమిది. వీనిలో ఒక్కొక్క దానిలో భైరవ, యామళ, మత, మంగళ, చక్రాష్టక, బహురూప, వాగీశ, శిష్టాష్టకాలని ఎనిమిది తంత్రాలు గలవు.

కాశ్మీర శైవములో వసుగుప్తుడు త్రికసంప్రదాయమును ప్రవర్తింపజేశాడు. వసుగుప్తుడు తనకు గోచరించిన మహాదేవగిరిపై శిలాఫలకంపై గల 77 శైవ సూత్రాలను గుర్తించి ఈ తత్త్వాన్ని ఉద్ధరించాడు. కల్లటుడు స్పందసిద్ధాంతాన్ని, సోమానందుడు ప్రత్యభిజ్ఞాసిద్ధాంతాన్ని ప్రచారం చేశారు. సోమానందశిష్యుడైన

ఉత్పలాచార్యుని ఈశ్వరప్రత్యభిజ్ఞాకారిక ప్రామాణిక గ్రంథము. సోమానంద శిష్యుడైన ఉత్పలుని ప్రశిష్యుడు అభినవగుప్తుడు ప్రత్యభిజ్ఞా సంప్రదాయం సర్వప్రసిద్ధం చేశాడు. అభినవగుప్తుని ఈశ్వరప్రత్యభిజ్ఞావిమర్శిని, వివృతవిమర్శిని, తంత్రసారం, తంత్రలోకం, పరమార్థసారం మొదలైనవి ప్రామాణిక గ్రంథాలు.

పాశుపతం శైవమతమునం దొకశాఖ. లకులీనుడు ఈమతస్థాపకుడు. ఈ పాశుపతమతస్థులు కారణము, కార్యము, విధి, యోగము, దుఃఖాంతము, అని ఐదుపదార్థాల నంగీకరించారు. పాశుపతులకు దైవనిర్ణయమందు, విధియందు పూర్ణవిశ్వాసము. ఈ విధి(దైవనిర్ణయం)జీవుని పుణ్య-పాపకర్మముల మీద ఆధారపడి వుండదు. దైవం మీదనే ఆధారపడి వుంటుంది. వీరిమతంలో కార్యం విద్య, కల, పశువు, అని మూడు విధాలు. అందు విద్య అనగా జ్ఞానము. కల యనగా జీవులమీద ఆధారపడు అచేతనసృష్టి. పశు వనగా బద్ధు డైనజీవుడు. ముక్తిస్థితిలో జీవులు భగవంతునితో సమానులై ఆయన ప్రతినిధులుగా కర్తవ్యాన్ని నెరవేరుస్తారు. వీరు సుఖదుఃఖాలను అనుభవించి క్రమంగా విరక్తిని బొంది శాస్త్రం చెప్పిన ప్రకారం మోక్షం కొఱకై దీక్షను గ్రహిస్తారు. దీక్షను తీసుకున్నవారు ఈశ్వర జ్ఞానాన్ని పొంది సన్న్యాసులవుతారు.

పాశుపతసిద్ధాంతంలో జీవితనియమాలు :- 1. దినానికి మూడుసార్లు భస్మస్నానం (విభూతి స్నానం) చేయాలి. 2. భస్మంపై పండుకోవాలి. 3. భగవంతుని స్తోత్రాలను పెద్దగా గానం చేయాలి. 4. నృత్యం చేయాలి. ఇదివీరి దినచర్య.

కాశ్మీరశైవప్రత్యభిజ్ఞాదర్శనంలో పరమశివుడు పరమతత్త్వము. అతడు శివశక్తిస్వరూపుడు. చైతన్యము లైన ఆత్మ నిర్వికార మైనా ప్రపంచంలోని అన్ని పదార్థాలలోనూ వుంది. ఈతత్త్వమే చైతన్యము, పరసంవిత, పరమేశ్వరుడు, పరశివుడు, విశ్వమయుడైన విశ్వోత్తీర్ణుడు. చిత్రవిచిత్రంగా వున్న ఈ విశ్వమంతా పరమశివునికన్న భిన్నం (వేరు) కాదు. విశ్వ మంతా శివునిస్ఫురణమే. పరమశివుడు అయిదురకా లయిన-చిచ్ఛక్తి, ఆనందశక్తి, ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి అను శక్తులతో కూడుకొని విశేషరూపంగ గోచరిస్తున్నాడు.

అందు చిచ్ఛక్తి ప్రకాశరూపము, స్వయంప్రకాశమానము, సర్వాన్ని ప్రకాశితం చేస్తుంది. 2. ఆనందశక్తి పరమేశ్వరుని నిరతిశయానందాన్ని సూచిస్తుంది. ఈ

ఆనందానుభవంలో బాహ్యవస్తు వేదీ అపేక్షితం కాదు. 3. ఇచ్ఛాశక్తి స్వతంత్రబోధను కలుగజేస్తుంది. నేను హాని లేని ఇచ్ఛాసంపన్నుడను అన్న తెలివి యిందులో కలుగుతుంది. 4. జ్ఞానశక్తి పరామర్శరూపం తెలియదగిన- తెలుసుకోవలసిన పదార్థాన్నిది సాధారణరూపంలో గుర్తింపజేస్తుంది. తెలుసుకోవలసినపదార్థానికి ఉన్ముఖత్వాన్ని ఆపాదిస్తుంది. 5. క్రియాశక్తి సర్వాకార్యాలను ధరింపజేసే యోగ్యత దీనిలో కలుగుతుంది. ఈ శక్తి పంచక ( ఈఅయిదుశక్తులు) యోగంచే పరమశివుడు విశ్వాకారంగా- జగత్తురూపంలో గోచరిస్తున్నాడు.

శైవాద్వైతమనే ఈత్రికదర్శనం అద్వైతాన్నే బోధిస్తుంది. కాని ఉపనిషత్ప్రతిపాదిత బ్రహ్మవాదానికి, శివాద్వైతవాదానికీ కొంతభేద ముంది. 1.ఉపనిషత్ప్రతిపాదిత బ్రహ్మవాదం( అద్వైతం)లో నిర్మలం నిర్వికారమ్మైన బ్రహ్మానికి కర్తృత్వం లేదు. ఈ శివాద్వైతంలో పరమశివునకు కర్తృత్వముంది. 2. ఇందలి( శివాద్వైతంలోని) ఆత్మ సృష్టి, స్థితి, సంహార- నిగ్రహ- అనుగ్రహాలనే పంచకృత్యపరాయణం.

పరమేశ్వరునికి ఈవిశ్వానికి గలసంబంధం దర్పణ( అద్దం) ప్రతిబింబం వంటిది. స్వచ్ఛ మైన అద్దంలో పదార్థా లన్నీ ప్రతిబింబిస్తాయి. ప్రతిబింబించినవి దర్పణంకంటే భిన్నంగానే గోచరిస్తాయి. అట్లే పరమేశ్వరప్రతిబింబిత మైన ఈ ప్రపంచం అభిన్న మైనా భిన్నంగానే గోచరిస్తూంది. లోకంలో ప్రతిబింబం బింబాన్ననుసరించి వుంటుంది. ఇం దట్లుగాదు. బింబం లేకపోయినా విశ్వాత్మక ప్రతిబింబం స్వత స్సిద్ధంగా వుంటుంది. కాబట్టే ద్వైతభావం కల్పితం. అద్వైతభావం వాస్తవికం. ఈప్రతిబింబసిద్ధాంతం ఆభాసవాద మని గూడ అనబడింది.

ఈవిశ్వ మంతా శక్తిస్ఫురణం. అసత్యం కాదు. ఈప్రత్యభిజ్ఞా దర్శనాన్ననుసరించి 36 తత్త్వా లున్నాయి. అవి 1. శివుడు, 2. శక్తి, 3. సదాశివుడు, 4. ఈశ్వరుడు, 5. శుద్ధవిద్య, 6. మాయ, 7. కల, 8. విద్య, 9. రాగం, 10.కాలం, 11. నియతి, 12. పురుషుడు, 13. ప్రకృతి, 14. బుద్ధి, 15. అహంకారం, 16. మనస్సు, 17.శ్రోత్రం(చెవి) 18.త్వక్(చర్మం) 19. చక్షుస్సు (కన్ను) 20. జిహ్వ (నాలుక) 21. ఘ్రాణం (ముక్కు) 22. వాక్, 23. పాణి(చెయ్యి) 24. పాదం, 25. పాయువు, 26. ఉపస్థ, 27. శబ్దం, 28. స్పర్శ, 29. రూపం, 30. రసం, 31. గంధం, 32. ఆకాశం, 33. వాయువు, 34. అగ్ని, 35. జలం, 36. భూమి .

ఈతత్త్వాలను 1.శివతత్త్వం, 2. విద్యాతత్త్వం, 3. ఆత్మతత్త్వం అని మూడు విధాలుగా భాగింపవచ్చును. అందు శివతత్త్వం రెండువిధాలు. విద్యాతత్త్వం మూడువిధాలు. ఆత్మతత్త్వం ముప్పై ఒక్క విధాలు. పరమశివునకు సృష్టి చేయాలనే సంకల్పం కలుగగానే శివరూపము శక్తిరూపము కల్గాయి. శివుడు ప్రకాశరూపుడు. శక్తి విమర్శ స్వభావం గలది. కృత్రిమంగా గాని అహం స్ఫూర్తియే విమర్శము. ఆస్ఫురణను చైతన్యం, సారం, హృదయం, స్పంద, అని గూడా అంటారు.

**1. శివుడు :-** పరమశివుడే శివుడు. ఇతడు మహాప్రకాశస్వరూపుడు. ఇచ్ఛా, జ్ఞాన, క్రియాత్మక పూర్ణానంద స్వభావరూపుడు. ఈశివతత్త్వం అన్నిమతాలకు అతీతం. సకలతత్త్వాలలో గల సృష్టి సంహారాలను నూర్లు వేలకొలది ఈ శివతత్త్వం సహిస్తుంది.

**2. శక్తి :-** పరమశివుని మొదటి స్పందనం శక్తి. ఇది ఇచ్ఛాశక్తి. మనం అద్దంలో చూచినపుడే మన ముఖాన్ని గుర్తిస్తాము. అట్లే శివుడు తనశక్తిలో ప్రతిబింబించి తన ప్రకాశమయస్వరూపాన్ని గుర్తిస్తాడు. శివశక్తిరూపాలు వేరువేరుగా వుండవు. పరమేశ్వరునికి తనస్వాతంత్ర్యంవలన విశ్వాకారంగా ఉల్లసిల్లాలని కోర్కె- ఇచ్ఛ గలుగ గా పరానందచమత్కారం ఉద్రేకిస్తుంది. వుద్రేకంలో కలిగే అహం అను పరామర్శయే శక్తితత్త్వం.

**3. సదాశివుడు :-** శివశక్తుల అంతర్వికాసమే సదాశివుడు. సదాశివదశలో కొంత చలనాత్మక స్ఫురణ కలుగుతుంది. జగత్తు అవ్యక్తంగా భాసిస్తుంది. సద్రూపంలో అంకురంగా వున్న ఈవిశ్వాన్ని సదాశివుడు స్వాత్మభావంతో ఆచ్ఛాదిస్తాడు. పరమేశ్వరుడు శుద్ధచిన్మాత్ర నాధారంగా అహ మంశమందు ఇద మంశాన్ని ప్రకాశితం జేస్తాడు. ఆయవస్థలో విశ్వం ఇంకా భావరాశివిషయువుగుటచే అస్ఫుటంగా వుంటుంది. అంచేత సదాశివతత్త్వం ఇచ్ఛాప్రధానం.

**4. ఈశ్వరుడు:-** సదాశివునిబాహ్యరూపమే ఈశ్వరుడు. అంకురించిన జగత్తును ఈశ్వరతత్త్వం అహంతాధర్మంతో ఆవరించివుంటుంది. స్ఫుటమైన ఇదమంశములో - విశ్వాంశంలో అహమంశం చేరినది కాగా జ్ఞానశక్తి ప్రధానమైన ఈశ్వరతత్వం సముల్లాసాన్ని పొందుతుంది.

# 3. సూర్యోపనిషత్

సూరితః స్వాతిరిక్తారిసూరినందాత్మ భావితమ్ !
సూర్యనారాయణాకార ం నౌమి చిత్సూర్యవైభవమ్ ॥

ఓం అథ సూర్యాథర్వాంగిరసం వ్యాఖ్యాస్యామః ఋషిః
గాయత్రీ ఛందః, అదిత్యో దేవతా,
హగ్ంస స్సో ఒహ మగ్నినారాయణయుక్తం బీజం,
హృల్లేఖా శక్తిః, వియదాదిసర్గసంయుక్తం కీలకమ్,
చతుర్విధపురుషార్థ సిద్ధ్యర్థే వినియోగః.

షట్ స్వరారూఢేన బీజేన షడంగమ్.
రక్తాంబుజసంస్థితం, సప్తాశ్వరథినం, హిరణ్యవర్ణం, చతుర్భుజం,
పద్మద్వయాభయవరదహస్తం, కాలచక్ర ప్రణేతారం
శ్రీ సూర్యనారాయణం - య ఏవం వేద స వై బ్రాహ్మణః.
ఓం భూ ర్భువ స్సువః, త త్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి
ధియో యో నః ప్రచోదయాత్,
సూర్య ఆత్మా జగత స్తస్థుష శ్చ,
సూర్యాద్ వై ఖ ల్విమాని భూతాని జాయంతే,
సూర్యాద్ యజ్ఞః పర్జన్యో ఒ(అ)న్న మాత్మా,
నమ స్తే ఆదిత్య , త్వ మేవ ప్రత్యక్షం కర్మక ర్తాసి, త్వ మేవ ప్రత్యక్షం బ్ర హ్మాసి,
త్వ మేవ ప్రత్యక్షం విష్ణు రసి, త్వ మేవ ప్రత్యక్షం రుద్రో ఒసి,
త్వ మేవ ప్రత్యక్షమ్ ఋ గసి, త్వ మేవ ప్రత్యక్షం యజు రసి,
త్వ మేవ ప్రత్యక్షం సా మాసి, త్వ మేవ ప్రత్యక్ష మథ ర్వాసి,
త్వ మేవ సర్వం ఛందో ఒసి,
ఆదిత్యాద్ వాయు ర్జాయతే, ఆదిత్యాద్ భూమి ర్జాయతే,
ఆదిత్యా దాపో జాయంతే, ఆదిత్యా జ్జ్యోతి ర్జాయతే,
ఆదిత్యాద్ వ్యోమ జాయతే, ఆదిత్యాద్ దేవా జాయంతే,
ఆదిత్యాద్ వేదా జాయంతే.

ఆదిత్యో వా ఏష ఏత న్మండలం తపతి, అసా వాదిత్యో బ్రహ్మ,
ఆదిత్యో ఽంతఃకరణ మనో బుద్ధి చి త్తాహంకారాః,
ఆదిత్యో వై వ్యాన స్సమానో ఽ(అ)పానః ప్రాణః,
ఆదిత్యో వై శ్రోత్ర త్వక్ చక్షూ రసన ఘ్రాణాః,
ఆదిత్యో వై వాక్ పాణి పాద పా యూపస్థాః,
ఆదిత్యో వై స్పర్శ శబ్ద రూప రస గంధాః,
ఆదిత్యో వై వచ నాదా నాగమన విస ర్గానందాః,
ఆనందమయో, విజ్ఞానమయో, విజ్ఞానఘన ఆదిత్యః,
నమో మిత్రాయ భానవే మృత్యో ర్మా పాహి,
భ్రాజిష్ణవే విశ్వ హేతవే నమః,
సూర్యాద్ భవంతి భూతాని, సూర్యేణ పాలితాని తు.
సూర్యే లయం ప్రాప్నువంతి
య స్సూర్య స్సో ఽహ మేవ చ, చక్షు ర్నో దేవ స్సవితా, చక్షు ర్న ఉత పర్వతః
చక్షు ర్ధాతా దధాతు నః ఆదిత్యాయ దీర్ఘ మాయుః.

ఓ మి త్యేకాక్షరం బ్రహ్మ, ఘృణి రితి ద్వే అక్షరే,
సూర్య ఇ త్యక్షరద్వయం, ఆదిత్య ఇతి త్రీ ణ్యక్షరాణి,
ఏక స్యైవ సూర్య స్యాష్టాక్షరో మనుః.
య స్స దాహరహ ర్జపతి, స వై బ్రాహ్మణో భవతి,
సూర్యోభిముఖో జప్త్వా మహావ్యాధిభయాత్ ప్రముచ్యతే, అలక్ష్మీ ర్నశ్యతి,
అభక్ష్యభక్షణాత్ పూతో భవతి, అగమ్యగమనాత్ పూతోభవతి,
పతితసంభాషణాత్ పూతో భవతి, అసత్సంభాషణాత్ పూతో భవతి,
మధ్యాహ్నే సూర్యాభిముఖః పఠేత్, సద్యోత్పన్న పంచమహాపాతకాత్ ప్రముచ్యతే,
సై షా సావిత్రీ విద్యా, న కించి దపి న కస్మైచిత్ ప్రశంసయేత్,
య ఏతాం మహాభాగః ప్రాతః పఠతి, స భాగ్యవాన్ జాయతే,
పశూన్ విందతి, వేదార్థం లభతే.
త్రికాల మేత జ్జప్త్వా క్రతుశతఫల మవాప్నోతి,
అస్తాదిత్యే జపతి స మహామృత్యుం తరతి, స మహామృత్యుం తరతి.
**య ఏవం వే దే** త్యుపనిషత్. ( శ్రీసూర్యమంత్రము :- ఘృణిస్సూర్య ఆదిత్యోమ్.)

# 4. గణపత్యుపనిషత్

య న్నత్వా మునయ స్సర్వే నిర్విఘ్నం యాంతి తత్పదమ్ !
గణేశోపనిషద్వేద్యం త (ద్బ) హ్మై వాస్మి సర్వగమ్ ॥

ఓమ్ లం నమ స్తే గణపతయే,

త్వ మేవ ప్రత్యక్షం తత్త్వ మసి, త్వ మేవ కేవలం క ర్తాసి,
త్వ మేవ కేవలం ధ ర్తాసి, త్వ మేవ కేవలం హ ర్తాసి,
త్వ మేవ ఖ ల్విదం (బ హ్మాసి, త్వం సాక్షా దా త్మాసి నిత్యం,
ఋతం వచ్మి, సత్యం వచ్మి.

అవ త్వం మామ్, అవ వక్తారమ్, అవ శ్రోతారమ్, అవ దాతారమ్,
అవ ధాతారమ్, అ వానూచాన, మవ శిష్యమ్,
అవ పురస్తాత్, అవ దక్షిణాత్తాత్, అవ పశ్చాత్తాత్, అ వోత్తరాత్తాత్,
అవచోర్ధ్వాత్తాత్, అ వాధరాత్తాత్, సర్వతో మాం పాహి, పాహి సమంతాత్,

త్వం వాఙ్మయః, త్వం చిన్మయః, త్వ మానందమయః, త్వం బ్రహ్మమయః,
త్వం సచ్చిదానందాద్వితీయో ఽసి, త్వం ప్రత్యక్షం (బ హ్మాసి,
త్వం జ్ఞానమయో, విజ్ఞానమయో ఽసి,

సర్వం జగ దిదం త్వత్తో జాయతే, సర్వం జగ దిదం త్వత్త స్తిష్ఠతి,
సర్వం జగ దిదం త్వయి లయ మేష్యతి. సర్వం జగ దిదం త్వయి ప్రత్యేతి.

త్వం భూమి రాపో ఽనలో ఽనిలో నభః, త్వం చత్వారి వాక్పరిమితా పదాని,
త్వం గుణత్రయాతీతః, త్వం దేహ త్రయాతీతః, త్వం కాలత్రయాతీతః,
త్వం మూలాధారే స్థితో ఽసి నిత్యమ్, త్వం శక్తిత్రయాత్మకః,
త్వాం యోగినో ధ్యాయంతి నిత్యమ్,

త్వం బ్రహ్మ, త్వం విష్ణుః, త్వం రుద్రః, త్వ మింద్రః,
త్వ మగ్నిః, త్వం వాయుః, త్వం సూర్యః, త్వం చంద్రమాః,
త్వం బ్రహ్మ, భూ ర్భువ స్సువ రోమ్,

గణాదీన్ పూర్వ ముచ్చార్య, వర్ణాదీన్ తదనంతరమ్,
అనుస్వారః పరతరః, అర్ధేందులసితం తథా, తారేణ యుక్త,
మేత దేవ తవ మనుస్వరూపమ్,
గకారః పూర్వరూపమ్, అకారో మధ్యమరూపమ్, అనుస్వార శ్చాంత్య రూపమ్,
బిందు రుత్తరరూపమ్, నాద స్సన్ధానమ్, సంహితా సంధిః, సైషా గాణేశీ విద్యా,
గణక ఋషిః, నిచృద్గాయత్రీ ఛందః, శ్రీమహాగణపతి ర్దేవతా,
ఓం గం గణపతయే నమః,
ఏకదంతాయ విద్మహే, వక్రతుండాయ ధీమహి, త న్నో దంతిః, ప్రచోదయాత్.

ఏకదంతం, చతుర్హస్తం, బిభ్రాణం పాశ మంకుశమ్,
అభయం, వరదం హస్తై ర్దధానం, మూషకధ్వజమ్,
రక్తం, లంబోదరం, శూర్పసుకర్ణం, రక్తవాససమ్,
రక్తగంధానులిప్తాంగం, రక్తపుష్పై స్సుపూజితమ్.
భక్తానుకంపినం, దేవం, జగత్కారణ మచ్యుతమ్,
ఆవిర్భూతం చ సృష్ట్యాదౌ, ప్రకృతేః పురుషా త్పరమ్.
ఏవం ధ్యాయతి యో నిత్యం స యోగీ యోగినాం వరః.
నమో వ్రాతపతయే, నమో గణపతయే, నమః ప్రమథపతయే,
నమ స్తే అస్తు లంబోదరా, యైకదంతాయ, విఘ్నవినాశినే, శివసుతాయ,
వరదమూర్తయే, నమో నమః.
ఏత దథర్వశిరో యో ఒధీతే,
స బ్రహ్మభూయాయ కల్పతే,
స సర్వత స్సుఖ మేధతే, స సర్వవిఘ్నై ర్న బాధ్యతే,
స పంచమహాపాతకోపపాతకాత్ ప్రముచ్యతే.
సాయ మధీయానో దివసకృతం పాపం నాశయతి,
ప్రాత రధీయానో రాత్రికృతం పాపం నాశయతి,
సాయం ప్రాతః ప్రయుంజానో ఒ(అ)పాపో భవతి,
ధర్మార్థకామమోక్షం చ విందతి,

ఇద మథర్వశీర్ష మశిష్యాయ న దేయమ్,
యో యది మోహా ద్దాస్యతి స పాపీయాన్ భవతి,
సహస్రావర్తనాద్ యం యం కామ మధీతే తం త మనేన సాధయేత్.

అనేన గణపతి మభిషించతి, స వాగ్మీ భవతి,
చతుర్థ్యా మనశ్నన్ జపతి, స విద్యావాన్ భవతి. ఇ త్యథర్వణవాక్యమ్.
బ్రహ్మాద్యావరణం విద్యా న్న బిభేతి కదాచ నేతి,
యో దూర్వాంకురై ర్యజతి, స వై శ్రవణోపమో భవతి,
యో లాజై ర్యజతి, స యశోవాన్ భవతి, స మేధావాన్ భవతి,
యో మోదకసహస్రేణ యజతి, స వాంఛితఫల మవాప్నోతి,
య స్సాజ్యసమిద్భి ర్యజతే, స సర్వం లభతే. స సర్వం లభతే.
అష్టౌ బ్రాహ్మణాన్ సమ్యగ్గ్రాహయిత్వా సూర్యవర్చస్వీ భవతి,
సూర్యగ్రహణే మహానద్యాం ప్రతిమా సన్నిధౌ వా జప్త్వా, స సిద్ధమంత్రో భవతి,
మహావిఘ్నాత్ ప్రముచ్యతే, మహాదోషాత్ ప్రముచ్యతే
స సర్వవిద్ భవతి, స సర్వవి ద్భవతి య ఏవం వేద. ఇ త్యుపనిషత్.

# 5. శ్రీ దేవ్యుపనిషత్

శ్రీ దేవ్యుపనిషద్విద్యా వేద్యాపారసుఖాకృతి ।
త్రైపదం బ్రహ్మచైతన్యరామచంద్రపదం భజే ॥

హరిః ఓమ్. సర్వే వై దేవా దేవీ ముపతస్థుః, కాసి త్వం మహాదేవీ,
సా బ్రవీ దహం బ్రహ్మస్వరూపిణీ, మత్తః ప్రకృతి పురుషాత్మకం జగత్,
శూన్యం చాశూన్యం చ, అహ మానందానానందౌ,
అహం విజ్ఞానావిజ్ఞానే, అహం బ్రహ్మా బ్రహ్మణీ వేదితవ్యే.
(ఇ త్యాహాథర్వ శ్రుతిః) (1)

అహం పంచభూతా న్యపంచభూతాని, అహ మఖిలం జగత్,
వేదో உహ మవేదో உహమ్, వి ద్యాహ మవి ద్యాహమ్,
అ జాహ మన జాహమ్, అధ శ్చోర్ధ్వం చ తిర్యక్ చాహమ్.

అహగ్ం రుద్రేభి ర్వసుభి శ్చరా మ్యహ మాదిత్యై రుత విశ్వదేవైః
అహం మిత్రావరుణా వుభౌ బిభ ర్మ్యహ మింద్రాగ్నీ అహ మశ్వినా వుభౌ.
అహగ్ం సోమం త్వష్టారం పూషణం భగం దధా
మ్యహమ్ విష్ణు మురుక్రమం బ్రహ్మాణ ముత ప్రజాపతిం దధామి.
అహం దధామి ద్రవిణగ్ం హవిష్మతే సుప్రావ్యే యే యజమానాయ సున్వతే,
అహగ్ం రాష్ట్రీ సంగమనీ వసూనాం చికితుషీ ప్రథమా యజ్ఞియానామ్
అహగ్ం సువే పితర మస్య మూర్ధన్, మమ యోని ర ప్స్వ న్తస్సముద్రే.
య ఏవం వేద, స దేవీ పద మాప్నోతి,
తే దేవా అ బ్రువన్, నమో దేవ్యై, మహాదేవ్యై, శివాయై, సతతం నమః,
నమః ప్రకృత్యై, భద్రాయై, నియతాః ప్రణతాః స్మ తామ్ (2)

తా మగ్నివర్ణాం, తపసా జ్వలంతీం, వైరోచనీం, కర్మఫలేషు జుష్టామ్,
దుర్గాం, దేవీగ్ం, శరణ మహం ప్రపద్యే అసురాన్ నాశయిత్ర్యై తే నమః.
దేవీం వాచ మజనయంత దేవా, స్తాం విశ్వరూపాః పశవో వదంతి
సా నో మంద్రేష మూర్జం దుహానా ధేను ర్వా గస్మా నుపసుష్టు తైతు.
కాళరాత్రీం, బ్రహ్మస్తుతాం, వైష్ణవీగ్ం, స్కందమాతరమ్,
సరస్వతీ, మదితిం, దక్షదుహితరం నమామః పావనాగ్ం శివామ్.
మహాలక్ష్మీం చ విద్మ హే సర్వసిద్ధ్యై చ ధీమహి, త న్నో దేవీ ప్రచోదయాత్.
అదితి రిహ జనిష్ట దక్షయా దుహితా తవ,
తాం దేవా అన్వజాయంత భద్రా అమృతబంధనః,
కామో, యోనిః, కామకలా, వజ్రపాణి, ర్గుహా హసా మాతరిశ్వాభ్ర మింద్రః
పునర్గుహా సకలామాయయాచ పునః కోశా విశ్వమా తాదివి ద్యోమ్.
ఏ షాత్మశక్తి, రేషా విశ్వ మోహినీ, పాశాంకుశధనుర్బాణధరా,
ఏషా శ్రీ మహావిద్యా, య ఏవం వేద, స శోకం తరతి. (3)

నమ స్తే అస్తు భవతి భగవతీ మాత రస్మాన్ పాతు సర్వతః,
సై షాష్టౌ వసవ, స్సై షై కాదశరుద్రా, స్సైషా ద్వాదశాదిత్యా,
స్సైషా విశ్వేదేవా, స్సోమపా, అసోమపా శ్చ,
సైషా యాతుధానా, అసురా, రక్షాగ్ంసి, పిశాచా, యక్షా, స్సిద్ధా

సైషా సత్వ రజ స్తమాగ్ంసి, సైషా ప్రజాప తీంద్ర మనవః,
సైషా గ్రహ నక్షత్ర జ్యోతీగ్ంషి కలా కాష్ఠాది కాలరూపిణీ.
తా మహం ప్రణౌమి నిత్యమ్, తాపహారిణీం దేవీం భుక్తిముక్తి ప్రదాయినీమ్
అనంతాం విజయాగ్ం శుద్ధాగ్ం శరణ్యాగ్ం శివదాగ్ం శివామ్.
వియదీకారసంయుక్తవీతిహోత్రసమన్వితమ్
అర్ధేందులసితం దేవ్యా బీజగ్ం సర్వార్థసాధకమ్.
ఏవ మేకాక్షరం మంత్రం యతయ శ్శుద్ధచేతసః.
ధ్యాయంతి పరమానందమయజ్ఞానాంబురాశయః .
వాఙ్మయీ బ్రహ్మభూ స్తస్మాత్ షష్ఠం వక్త్రసమన్వితమ్.
సూర్యో వామః శ్రోత్రబిందు స్సంయు త్యష్ట తృతీయకమ్,
నారాయణేన సంయుక్తో వాయు శ్చాధర సంయుతః,
విచ్చే నవార్ణకో ఒర్ణ స్స్యా న్మహదానందదాయకః.

హృత్పుండరీకమధ్యస్థాం, ప్రాతస్సూర్యసమప్రభామ్,
పాశాంకుశధరాగ్ం, సౌమ్యాం, వరదాభయహస్తకామ్,
త్రిణేత్రాగ్ం, రక్తవసనాం, భక్తకామదుఘాం, భజే,
నమామి త్వా మహం దేవి, మహాభయవినాశినీమ్.
మహాదుర్గ ప్రశమనీం, మహాకారుణ్య రూపిణీమ్.
యస్యాః స్వరూపం బ్రహ్మాదయో న జానంతి , తస్మా దుచ్య తేఽ(అ)జ్ఞేయా,
యస్యా అంతో న విద్యతే, తస్మా దుచ్యతే ఽ(అ)నంతా,
యస్యా గ్రహణం నోపలభ్యతే, తస్మా దుచ్యతే ఽ(అ)లక్ష్యా,
యస్యా జననం నోపలభ్యతే, తస్మా దుచ్యత అజా,
ఏ కైవ సర్వత్ర వర్తతే, తస్మా దుచ్యత ఏకా,
ఏ కైవ విశ్వరూపిణీ, తస్మా దుచ్యతే, నైకా,
అత ఏ వోచ్యతే- అజ్ఞేయా, అనంతా, అలక్ష్యా, అజా, ఏకా, అనైకా ఇతి.
మంత్రాణాం మాతృకాదేవీ, శబ్దానాం జ్ఞానరూపిణీ,
జ్ఞానానాం చిన్మయాతీతా, శూన్యానాగ్ం శూన్యసాక్షిణీ .
యస్యాః పరతరం నాస్తి సైషా దుర్గా ప్రకీర్తితా.

దుర్గాత్ సంత్రాయతే యస్మా ద్దేవీ దు ర్గేతి కథ్యతే,
ప్రపద్యే శరణం దేవీం దుం దుర్గే దురితం హర.

తాం దుర్గాం, దుర్గమాం, దేవీం, దురాచారవిఘాతినీమ్,
నమామి భవభీతో ఒహగ్ం సంసారార్ణవతారిణీమ్.
ఇదమథర్వ శీర్షం యోఒ ధీతే
స పంచాథర్వణశీర్షజపఫల మవాప్నోతి,
ఇద మథర్వశీర్ష మజ్ఞాత్వా యో ఒర్చాం స్థాపయతి,
శతలక్షం ప్రజ ప్త్వాపి సో ఒర్చాసిద్ధిం న విందతి.
శత మష్టోత్తరం చాస్యాః పురశ్చర్యావిధిః స్మృతః
దశవారం పఠే ద్య స్తు సద్యః పాపైః ప్రముచ్యతే.
మహోదుర్గాణి తరతి మహాదేవ్యాః ప్రసాదతః.
ప్రాత రధీయానో రాత్రికృతం పాపం నాశయతి,
సాయ మధీయానో దివసకృతం పాపం నాశయతి,
త త్సాయం ప్రాతః ప్రయుంజానో అపాపో భవతి.
నిశీథే తురీయ సంధ్యాయాం జప్త్వా వాక్సిద్ధి ర్భవతి
నూతన ప్రతిమాయాం జప్త్వా దేవతాసాన్నిధ్యం భవతి,
ప్రాణ ప్రతిష్ఠాయాం జప్త్వా ప్రాణానాం ప్రతిష్ఠా భవతి,
భౌమాశ్విన్యాం మహాదేవీ సన్నిధౌ జప్త్వా మహామృత్యుం తరతి.
య ఏవం వే దే త్యుపనిషత్. (మొదట చివర భద్రం కర్ణేభిః అనే శాంతి వచనం)

## -: ఋగ్వేదీయ సూర్యసూక్త :-

**ఓం చిత్రం దేవానా ముదగా దనీకం చక్షు ర్మిత్రస్య వరుణ స్యాగ్నేః**
**ఆ ప్రా ద్యావాపృథివీ అంతరిక్షం సూర్య ఆత్మా జగత స్తస్థుష శ్చ.**

సూర్యో దేవీ ముషసం రోచమానాం మర్యో న యోషా మభ్యేతి పశ్చాత్।
యత్రా నరో దేవయంతో యుగాని వితన్వతే ప్రతి భద్రాయ భద్రమ్.

భద్రా అశ్వా హరితః సూర్యస్య చిత్రా యత గ్వా అనుమాద్యాసః
నమస్యంతో దివ ఆపృష్ఠ మస్థుః పరి ద్యావాపృథివీ యంతి సద్యః.

తత్ సూర్యస్య దేవత్వం తన్మహిత్వం మధ్యా కర్తో ర్వితతం సంజభార
య దేదయుక్త హరితః సథస్థా దాద్రాత్రీ వాస స్తనుతే సి మస్మై.

త న్మిత్రస్య వరుణ స్యాభిచక్షే సూర్యో రూపం కృణుతే ద్యో రుపస్థే
అనంత మన్యత్ రుశ దస్య పాజః కృష్ణ మన్య ద్ధరితః సంభరంతి.

అద్యా దేవా ఉదితా సూర్యస్య నిరంహసః పిపృతా నిరవద్యాత్
త న్నో మిత్రో వరుణో మా మహంతా మదితిః సింధుః పృథీవీ ఉత ద్యౌః.

# భాగ్యసూక్తమ్

1. ప్రాత రగ్నిం ప్రాత రిన్ద్రగ్ం హవామహే ప్రాత ర్మిత్రావరుణా ప్రాత రశ్వినా !
ప్రాత ర్భగ్ం పూషణం బ్రహ్మణస్పతిం ప్రాత స్సోమ ముత రుద్రగ్ం హువేమ.

2. ప్రాత ర్జితం భగ ముగ్రగ్ం హువేమ వయం పుత్ర మదితే ర్యో విధర్తా !
ఆద్ధ్ర శ్చిద్యం మన్య మాన స్తు కశ్చి ద్రాజా చిద్యం భగం భక్షీత్యాహ.

3. భగ ప్రణేతర్భగ సత్యరాధో భగే మాం ధియ ముదవ దదన్నః ।
భగ ప్ర ణో జనయ గోభి రశ్వై ర్భగ ప్ర నృభి ర్నృవన్త స్స్యామ.

4. ఉ తేదానీం భగవన్త స్స్యా మోత ప్రపిత్వ ఉత మధ్యే అహ్నామ్ ।
ఉ తోదితా మఘవన్ సూర్యస్య వయం దేవానాగ్ం సుమతౌ స్యామ.

5. భగ ఏవ భగవాగ్ం అస్తు దేవా స్తేన వయం భగవన్త స్స్యామ ।
తం త్వా భగ సర్వ ఇజ్జో హవీమి స నో భగపుర ఏ తా భవేహ.

6. స మధ్వరా యోషసో ఽన మన్త దధిక్రా వేవ శుచయే పదాయ ।
అర్వాచీనం వసు దిదం భగ న్నో రథ మి వాశ్వా వాజిన ఆవహన్తు.

7. అశ్వావతీ ర్గోమతీ ర్న ఉషాసో వీరవతీ స్సద ముచ్ఛన్తు భద్రాః ।
ఘృతం దుహానా విశ్వతః ప్రపీనా యూయం పాత స్వస్తిభి స్సదా నః.

8. యో మాగ్నే భాగినగ్ం సన్త మథా భాగం చికీర్షత్యభాగ మగ్నే।
తం కురు మా మగ్నే భాగినం కురు స్వాహా.

9. సక్తు మివ తితఉ నా పునంతో యత్ర ధీరా మనసా వాచ మక్రత ।
అత్రా సఖా య స్సఖ్యాని జానతే భ ద్రైషాం లక్ష్మీ ర్నిహితాధి వాచి.

10. ఇంద్రాణీ మా సునారిషు సుపత్నీ మహ మశ్రవం ।
న హ్యస్యా అపరం చ న జరసా మరతే పతిః.

11. వయ స్సుపర్ణా ఉపసేదు రింద్రం ప్రియమేధా ఋషయో నాధమానాః ।
అపధ్వాన్త మూర్ణుహి పూర్ధి చక్షు ర్ముముగ్ధ్యస్మా న్నిధయే ఽవబద్ధాన్.

12. ఘర్మా సమన్తా త్రివృతం వ్యాపతు స్తయో ర్జుష్టిం మాతరిశ్వా జగామ ।
దివస్పయో దిధిషాణా అవేషన్ విదు ర్దేవాః సహసా మాన మర్కమ్.

13. తిస్రో దేష్ట్రాయ నిర్ఋతీ రుపాసతే దీర్ఘశ్రుతో వి హి జానన్తి వహ్నయః ।
తా సాం నిచిక్యుః కవయో నిదానం పరేషు యా గుహ్యేషు వ్రతేషు.

14. చతుష్కపర్దా యువతి స్సుపేశా ఘృత ప్రతీకా వయునాని వస్తే ।
తస్యాం సుపర్ణా వృషణా నిషేదతు ర్యత్ర దేవా దధిరే భాగధేయమ్ ॥

# శ్రీశివార్చనం - అర్చావైభవం

## స్వాగతం:-

రుద్ర **అభిషేకం** :-

"అభిషేకప్రియ శ్శివః," శివుడికి అభిషేకం ఇష్టం. అభిషేకం లేదా అభిషేచనం అంటే అంతటా బాగా తడవడం. సంతతధారతో తడుస్తూనే వుంటాడు శివుడు. గంగాధరుడికి నెత్తిపై గంగధార నిరంతరంగా వుంటుంది. వుండాలి. అందుకే **శివార్చనంలో అభిషేకం అత్యంతం** ప్రధానం. అభిషేకం అనేది శివార్చనానికి పర్యాయం **అన్నంతగా, ఆవాహనం మొదలైన ఇతర ఉపచారాలు** లెక్కలోనికి రానంతగా, ప్రధానమైంది. అస లావుపచారాల్లో ఒకటైన స్నానమే(దైవస్నానం) అభిషేకం. ఇది స్నానం అనే ఒక ఉపచారం అనే అంశం గూడా మరుగుపడేటంతగా మిగిలిన అన్ని ఉపచారాలకంటే ఎక్కువసమయం దీర్ఘంగా నడుస్తుంది.

**సర్వశ్రేష్ఠం** :-

**పూజాయా అధికో హూమో, హోమా త్తర్పణ ముత్తమం,**
**తర్పణా చ్చ జపం శ్రేష్ఠో, హ్యాభిషేకః, పరో జపాత్.**

మంత్రపూత మైన దీ స్నానం-అభిషేకంలో ప్రముఖ మైనది రుద్రం.

**స్థావరే జంగమే లింగే** సమాహితమన శ్శుచిః
**న్యాసధ్యానాదిసహితం** పంచమే సూక్తపూర్వకం
**ప్రజపన్ శతరుద్రీయ** మభిషేకం సమాచరేత్.

రుద్రం :

రుద్రం, రుద్రప్రశ్నం, రుద్రసూక్తం, రుద్రాధ్యాయం, రుద్రోపనిషత్తు, **శతరుద్రీయం** ఇత్యాదిగా వ్యవహరింపబడుతున్నది నమకం. ఇది యజుర్వేదం **నాల్గవకాండలో** ఐదవప్రశ్నం. (చమకం ఏడవప్రశ్నం) నమశ్శబ్దం తరచుగా **ఉపయో**గింపబడడం వల్ల ఏర్పడిన నమకం **అనే** పేరే వ్యవహారంలో బాగా ప్రచురం. **అలాగే** "చ,మే" **అనే** జంట **తరుచూ** ప్ర**యుక్తమవడం**వల్ల "చమకం." నమకానికి **శాంతిపాఠం** కావడంవల్ల చమకాన్ని కూడా కలు**పు**కుని (నమకచమకాలు రెండింటినీ **కలిపి**) రుద్రాధ్యాయ మిత్యాదిగా వ్యవహరిస్తున్నట్లుగా చెప్తారు.

రుద్రప్రశస్తి :

**వేదేషు శతరుద్రీయం, దేవతాసు మహేశ్వరః,**
**క్షేత్రేషు అవిముక్తం, వై మంత్రే (షు) పంచాక్షరో వరః.**

అని శివరహస్యం రుద్రప్రాశస్త్యాన్ని పేర్కొంటున్నది.

**వేద మేకగుణం జప్త్వా తద హ్నైవ విశుధ్యతి,**
**రుద్రైకాదశినీం జప్త్వా తత్క్షణా దేవ శుధ్యతి.**

రుద్రం వేదాధికం.

రుద్రులు 11మంది (ఏకాదశరుద్రులు). రుద్రం విషయంలోనూ ఈ ఏకాదశ (11) సంఖ్యకు ప్రాముఖ్యం వుంది. ఒక్కొక్కసారి నమకం పూర్తిగా చెప్పి తర్వాత చమకంలోని ఒక్కొక్క అనువాకం చెప్తే 11 సార్లు నమకమూ ఒకసారి చమకమూ, పూర్తవుతాయి. దీన్నే రుద్రం, రుద్రైకాదశిని అంటారు.

ఈ రుద్రం 11సార్లు చేస్తే (121నమకాలు 11 చమకాలు) లఘురుద్ర మనీ, లఘురుద్రం 11సార్లు (1331 నమకాలు, 121 చమకాలు) చేస్తే మహారుద్ర మనీ, మహారుద్రం 11 సార్లు (14,141 నమకాలు, 1331 చమకాలు) చేస్తే అతిరుద్ర మనీ అంటారు.

నమకచమకాలతోపాటు పురుషసూక్తం గూడా అభిషేక పారాయణలో ప్రాధాన్యం వహించి వుంది.

**నమకం చమకం చైవ పౌరుషం సూక్త మేవ చ**
**నిత్యం త్రయం ప్రయుంజానో బ్రహ్మలోకే మహీయసే.**

ఇతరపూజలలో (నమకచమకాలు లేకుండా) పురుషసూక్తం మాత్రమే చెప్పేవిధానంలోనూ పురుషసూక్తానికే ఇంతప్రాధాన్యం.

**యో జపే త్పురుషసూక్తం త్రివారం తు దినే దినే,**
**పారాయణఫలం తస్య వేదానాం వై సహస్రశః.**

పురుషసూక్తవిధానంతోటి దేవతార్చనంలో మొదట న్యాసంలో ఒకసారీ, స్నానంలో ఒకసారీ, షోడశ ఉపచారాలు చేసేటప్పుడు (ఒక్కొక్క ఉపచారానికి

ఒక్కొక్క మంత్రం చొప్పున చెప్పడంవల్ల) ఒకసారీ, పురుషసూక్తం 3సార్లు చెప్పడం జరుగుతుంది. కాబట్టి యీప్రకారమైన నిత్య దేవతార్చనంతో (3సార్లుగా పురుషసూక్త జపంవల్ల) వేయి సార్లు సర్వవేదాలూ పారాయణం చేసినఫలం లభిస్తుంది.

శివపంచాయతనాన్ని అర్చించేటప్పుడు గూడా ఈవిధంగా 3 పర్యాయాలు పురుషసూక్తం చెప్పడం వుంది. అలా కాక (మహాన్యాసం) బ్రహ్మమంత్రవిధానంతో ఉపచారాలు జరిపితే స్నానంలో నమకం చమకం, పురుషసూక్తం చెప్పడం జరుగుతుంది. (కాబట్టి) ఆ మూడింటిపారాయణం వల్లను వేదాధిక ఫలం ముందే చెప్పబడింది.

రుద్రార్చనం :

నా రుద్రో రుద్ర మర్చయేత్ - రుద్రుణ్ని అర్చించాలంటే ముందుగా అర్చకుడు రుద్రుడు గావాలనీ, అంటే రుద్రుడు కానివాడు రుద్రార్చనకు అర్హుడు కాడనీ, అందుకోసం తనలో రుద్రత్వాన్ని న్యాసం చేసుకోవాలనీ అనుకుని మహాన్యాసం ప్రారంభించడం గమనిస్తాం.

**దైవాంశ స్స తు విజ్ఞేయః, యో భవే ద్విభవాధికః**
**నా నృషిః కురుతే కావ్యం, నా రుద్రో రుద్ర మర్చ(తే) తి.**

అని దేవీభాగవతం. విభవాధిక్యం వుంటే, వాడు సహజంగా దైవాంశ కలవాడే. కావ్యం వ్రాశాడంటే ఋషే. అలాగే రుద్రుణ్ని అర్చిస్తున్నాడంటే వాడు రుద్రుడే. అలాగే సూక్తిముక్తావళిలో ఆర్యధర్మంగా -

**నాదేవాంశో దదా త్యన్నం, నా రుద్రో రుద్రమర్చ(యేత్) తి**
**నా నృషిః కురుతే కావ్యం, నా విష్ణుః పృథివీపతిః.**

రా జయినాడంటే విష్ణువే. వాడియందు విష్ణ్వంశ వున్నది. రాజవడం కోసం విష్ణుత్వాన్ని తెచ్చిపెట్టుకోవడం లేదు. విష్ణుత్వం ఉన్నవాడే రాజవుతున్నాడు. అలాగే కావ్యం రాయడం కోసం ఋషిత్వం తెచ్చుకోవడం వంటివి వుండవు. ఆక్రమంలో రుద్రార్చన చేయడం కోసం రుద్రత్వం తెచ్చిపెట్టుకోవాలా ? రుద్రత్వాన్ని న్యాసం చేసుకోవాలా? అని సందేహం.

రుద్రుణ్ణే అర్చిస్తున్నాడంటే వాడు రుద్రు డైనట్లే లెక్క. రుద్రః=రుద్రుడైన ; వా = నరుడు, రుద్రం అర్చతి. రుద్రుడిని అర్చించా లనే సంకల్పం కలిగిందంటే వాడు రుద్రు డైనట్లే. రుద్రుడు కానివాడికి రుద్రార్చనం చేయాలనే కోరికే కలగదన్నమాట. అయితే మరి మహాన్యాసమో, మామూలున్యాసమో-ఎందుకు?

ఇలాగే పురుషసూక్త, శ్రీసూక్తాదులన్యాసం కూడా వుంది గదా.

అర్చింపబడే దైవమూ, అర్చించే వ్యక్తి ఇద్దరూ అభిన్నం అనేభావం ప్రధానం. (అర్చించేవాడు అర్చింపబడేవాడూ అర్చనమూ కూడా ఏకమే.)

ఆభావాన్ని ఈన్యాసం కల్పించి దృఢపరుస్తుందనవచ్చు. దేవార్చనలో ప్రతిమాదులలాగా ఈన్యాసం కూడా తద్భావనకు ఆధారం కల్పించేది మాత్రమే అని గుర్తింపవచ్చు.

సర్వదేవతాపూజల్లోనూ ఈ ఐక్యభావన అవసరమే, కాబట్టి నా రుద్రో రుద్ర మర్చయే త్తనేస్మరణం అవసరమా ?

మహాన్యాసం :

రుద్రార్చన విషయంలో బోధాయనోక్తమైన మహన్న్యాసం పంచాంగాలతో విస్తృతంగా సార్థకనామంగావుంది. శరీరావయావాల్లో పైనించి క్రిందికి 2 సార్లు, క్రిందినుంచి పైకి 2 సార్లు హృదయాదిన్యాసం 1, మొత్తం అయిదింటితో పంచాంగం అయింది. మహన్న్యాసం.

1. శిఖాద్యస్త్రాంత మేకత్రింశ దంగన్యాసః ప్రథమః.

యాతే రుద్రేతి శిఖాయాం... య ఏతావంత శ్చే తి దిగ్బంధః

ఇ త్యంతం ప్రథమన్యాసః.

యా తే రుద్ర అని శిఖమొదలుకొని ప్రముంచ ధన్వన అని అస్త్రం చివరగా శరీరంలోని (పై నుంచి క్రిందికి) 31 అవయవాల్లోను చేసుకునే న్యాసం మొదటిది.

2. మూర్ధాదిపాదాంతం దశాంగన్యాసః ద్వితీయః

ఓం మూర్ధ్నే నమః......యం పాదాభ్యాం నమః.- ఇ త్యంతం ద్వితీయన్యాసః.

**ఓం నమో భగవతే రుద్రాయ అనే మంత్రంలోని పది అక్షరాలనూ మూర్ధం నుండి పాదాలవరకు శరీరంలో**(పైనుండి క్రిందకు)పది **అవయవాల్లో చేసుకునే** న్యాసం రెండవది.

3. పాదాది మూర్ధాంతం పంచాంగన్యాసః తృతీయః.

సద్యోజాతం ప్రపద్యామి....పాదాభ్యాం నమః, ఈశానః....మూర్ధ్నే నమః.

ఇత్యంతం తృతీయన్యాసః.

సద్యోజాతం మొదలైన బ్రహ్మమంత్రాలు అయిదింటినీ పాదముల నుంచి మూర్ధం వరకు శరీరంలో (క్రింద నుంచి పైకి) అయిదు అవయవాల్లో చేసుకునేన్యాసం మూడవది.

సద్యోజాతం.....అస్య శ్రీ హంస గాయత్రీ మహామంత్రస్య....
హంసో నామ సదాశివః. ఇది తృతీయన్యాసః.

అని హంసగాయత్రీమంత్రంతో శిరస్సును స్పృశిస్తూ, హంసగాయత్రిని శిరస్సులో న్యాసం చేసుకోవాలనీ, అది కూడా ఈ మూడవన్యాసంలో భాగ మనీ, కొంద రంటారు.

ఇక్కడ దిక్పాలక మంత్రాలతో ఉన్న సంపుటీకరణం న్యాసం కాదు.

తరవాత చెప్పిన దశాంగ షోడశాంగ రౌద్రీకరణాలు మూడవన్యాసంలోనివనీ, నాల్గవన్యాసంలోనివనీ, అసలు న్యాసం కావని భిన్నాభిప్రాయాలున్నాయి.

4. గుహ్యాది మస్తకాంతం పంచాంగన్యాసః చతుర్థః.

**మనోజ్యోతిః** అని గుహ్యంతో ప్రారంభించి, జాతవేదాః అని శిరస్సు వరకు **శరీరంలో** (క్రిందనుంచి పైకి) గుహ్య, నాభి, హృదయ, కంఠ, ముఖ, శిరస్సులనే **ఆరు అవయవాల్లోనూ** చేసుకునే న్యాసం నాల్గవది.

దశాంగరౌద్రీకరణం, షోడశాంగరౌద్రీకరణం ఇతి చతుర్థన్యాసః.

ఆత్మరక్షా ! మనోజ్యోతి ర్జుషతాం..య ఏవం వేద. (ఇ త్యంతం నాయం న్యాసః.)

దశాంగ, షోడశాంగ రౌద్రీకరణాలు చతుర్థన్యాసంగా భావించేవాళ్ళు **మనోజ్యోతిః** అని గుహ్యాదులలో చేసుకునే న్యాసం కూడ న్యాసమే కాదంటారు.

ఇక్కడ "ఆత్మరక్ష" గా ఆత్మ న్నాత్మన్ అని మొదలుగా చెప్పబడిన భాగం న్యాసం కా దనవచ్చు.

5. హృదయాది అస్త్రాంతం పంచాంగన్యాసః పంచమః.

శివసంకల్ప మారభ్య, త్వ మగ్నే త్వ మగ్నే శతరుద్రీయ మి త్యస్త్రాయ ఫట్.

ఇత్యంతం పంచమన్యాసః.

శివ సంకల్పాలు మొదలుకొని త్వమగ్నే అని హృదయాది షడంగాలలో చేసుకునే న్యాసం అయిదవది చివరిది.

శివసంకల్ప మారభ్య, త్వ మగ్నే త్వ మగ్నే శతరుద్రీయ మి త్యస్త్రాయ ఫట్.

ఇత్యంతం చతుర్థన్యాసః.

అని దీనిని చతుర్థన్యాసంగా పేర్కొంటూ కొందరు

ప్రజననే బ్రహ్మ తిష్ఠతు..సర్వే ష్వంగేషు సర్వా దేవతా యథాస్థానం తిష్ఠంతు..

ఇత్యంతం పంచమన్యాసః.( శ్రీ శివపూజ పుటలు 110,165)

తనలో దేవతాస్థాపనం చేసుకునే భాగం అయిదవన్యాసంగా చెప్తారు.

ఈదేవతాస్థాపనం షోడశాంగరౌద్రీకరణానికి ప్రత్యామ్నాయం ... కొందరంటారు.(అభినవశంకర రుద్రభాష్యం.)

**లఘున్యాసం :**

మహన్న్యాసంలాగానే లఘున్యాసం కూడా ప్రచారంలో వుంది. లఘున్యాస పూర్వక రుద్రాభిషేకం గ్రంథాలు గూడా ప్రత్యేకంగా వెలువడ్డాయి. అయితే మహన్న్యాసం లాగా లఘున్యాసం అనే పేరుతో ఒకటి ఋషినిర్దిష్టంగా కనబడదు. అసలు లఘున్యాసం అంటే ఏది ?

**రుద్రన్యాసమా :**

అస్య శ్రీరుద్రప్రశ్నస్య - అస్య సకలస్య రుద్రాధ్యాయస్య మొదలుగా ఋష్యాదినిర్దేశం, అంగన్యాస కరన్యాసాలున్న భాగాన్ని లఘున్యాసం అంటున్నారు. కాని యిది రుద్రన్యాసం. రుద్రం అంటే నమకం. నమకం ఉపయోగించే సందర్భంలో ఎప్పుడైనా ఈన్యాసం అవసరమే. అందుకే మహన్న్యాసం చేసుకున్న సందర్భంలో కూడా

నమకప్రయోగానికి పూర్వంలో ఈ రుద్ర(లఘు)న్యాసం చేయడం జరుగుతున్నది. కాబట్టి యీరుద్రన్యాసం మహన్న్యాసానికి బదులుగా దానికి లఘురూపంగా చేయబడేది కాదు. అంచేత ఈరుద్రన్యాసాన్ని లఘున్యాసంగా వ్యవహరించడానికి తగిన ప్రమాణం కానరావడం లే దనే తద్జ్ఞుల నిర్ణయం యథార్థం.

లఘున్యాసం మరోరకంగా కనబడుతూ వినబడుతూ కూడా వుంది. బోధాయనుడు యా తే రుద్ర ఇతి శిఖాయాం ఇత్యాదిగా చెప్పినపంక్తులే లఘున్యాసం.

(మహా)న్యాసం ఎలా ఆచరించాలో మహాన్యాసవిధానాన్ని గురించి సూత్రప్రాయంగా చెప్తున్న ఆ మాటలు న్యాసం ఎలా అవుతుందో తెలియకుండా వుంది. ఇది న్యాసం చేసుకునే విధానాన్ని నిర్దేశించేదే తప్ప న్యాసం అనడం యుక్తియుక్తం కాదు. దీన్ని లఘున్యాసంఅనడంలో ఔచిత్యం లేదనే తద్జ్ఞుల నిర్ణయం సమంజసం.

రావణోక్తన్యాసఖండం లఘున్యాసం అనగా వినడం జరిగింది. కాని అదీ మహాన్యాసంగానే పేర్కొనబడిం దందులో. సంపుటీకరణం లాంటివి కొన్ని మాత్రం తగ్గుతాయేమొ కాని రావణోక్తం కూడా దాదాపుగా బోధాయనోక్త మహన్న్యాసమే. ఇదీ లఘున్యాసం కాదు. ఇక్కడ మహన్న్యాసం కూడా బోధాయనోక్త విధానమే ఆచరణలో వుంది. రావణోక్తం వేరే దైనా ప్రాంతంలో వుందేమొ.

మరింక లఘున్యాసం ఏది? అని ప్రశ్న. అసలు రుద్రన్యాసం ఒక్కటే. అది మహాన్యాసం. దానిని సంగ్రహించి చెప్పేదో, దానికి ప్రత్యామ్నాయం గానో, లఘు రూపంగానో లఘున్యాసం అనేది ఒకటి లేనే లేదనే పెద్దల అభిప్రాయం.

అయితే నా రుద్రో రుద్రమర్చయేత్, న్యాసధ్యాన పూర్వకం అన్నారు గదా ! అని మహన్న్యాసం చేసుకోవలసిందే అంటే అది అన్ని వేళలా సాధ్యమా ? అభిలాష వున్నా నేటి సాంఘికజీవనంలో అన్నివేళలా ఆచరించడం కష్టం. కాదు అసాధ్యం అన్నా తప్పు లేదు. అయితే మరిన్యాసం అసలు పూర్తిగా మానుకోవలసిందేనా ?

లాభం సంగతి అలా వుంచి, నష్టం లేదు. ఆత్మతృప్తి వుంటుంది. అని యీగ్రంథంలో రుద్రన్యాసం విషయంలో ఒక విధమైన లఘు విధానం ఎన్నుకోవడం జరిగింది. అది -పుటలో అధస్సూచికలో ఇవ్వబడింది.

మహన్యాసం పంచాంగన్యాసం. అయిదున్యాసాలూ చేయగలిగితే మహాన్యాసం, అంత కుదరకపోతే అందులోని ఒకటో, రెండో యథావకాశంగా చేసుకోవచ్చు గదా. (అని) పంచాంగన్యాసంలో ద్వితీయాంగన్యాసం ఓం నమో భగవతే రుద్రాయ అనే అక్షరాలతో మూర్ధాది పాదపర్యంతన్యాసం - పై నుంచి క్రిందకి ఒకటి, తృతీయాంగన్యాసం - సద్యోజాతాది పంచమంత్రాలతో పాదాదిమూర్ధ పర్యంతం(క్రిందినుంచిపైకి) హంసమంత్రంతో శిరోన్యాసమూ అనేది రెండు. ఇలా ఒకటి, రెండింటితో న్యాసం లఘువుగా, నిత్యాచరణానికి వీలుగా వుంటుంది. (మిగిలిన వాటిని యథావకాశంగా మహన్యాసం నుంచి తీసుకోవచ్చును.) బోధాయనుడు చెప్పిన క్రమాన్ననుసరించి తర్వాత తనలో దేవతాస్థాపనం ఆత్మైక్యం ఇందులో వున్నాయి. వీటిని యథావకాశంగా ఆచరించవచ్చును.( తనలో దేవతాస్థాపనం చేసుకోవడం అనేది మహాన్యాసంలోని షోడశాంగరౌద్రీ కరణానికి మారుగా కూడా రుద్రభాష్యం పేర్కొన్నది.) మహాన్యాసవిధానంలో ఈ రెండూ ఆచరిస్తున్నా, దేవతాస్థాపనం చేసుకుంటే షోడశాంగ రౌద్రీకరణం చేసినట్లే. కాబట్టి న్యాసంలో మరొకొంతభాగమూ కలిసి చేరుతున్నది. నమకం చెప్పబోయే ముందు రుద్రన్యాసం (అంగన్యాస కరన్యాసాలు) సాధారణంగా చేయవలసిందే.

మొత్తంమీద రుద్రార్చనవిషయంలో న్యాసం ఒక్కటే. అది మహాన్యాసం. ప్రతిదినం అది మొత్తం ఆచరించటం కష్టం గావడంవల్ల యథావకాశంగా మహన్యాసంలో లఘువుగా వున్న న్యాసభాగాలు కొన్ని మాత్రం ఆచరించడం ఉచితమే ననిపించి అలా చేయడం జరిగింది.

**పురుషసూక్తన్యాసం :**

శివపంచాయతనార్చనం కూడా పురుషసూక్త న్యాసంతో చేసే సంప్రదాయమూ వుంది. సహస్రశీర్షా మొదలుకొని యజ్ఞేనయజ్ఞ మయజంత-వరకుండే 18 ఋక్కులతో ఒక్కొక్క దానితో క్రమంగా 1. ఎడమచేయి, 2.కుడిచేయి, 3. ఎడమపాదం, 4.కుడిపాదం, 5. ఎడమ పిక్క, 6. కుడిపిక్క, 7 గుహ్యం, 8. నాభి, 9. హృదయం, 10. కంఠం, 11. ఎడమభుజం, 12. కుడిభుజం, 13. ముఖం(నోరు), 14. ఎడమచెవి, 15. కుడిచెవి, 16. కుడికన్ను, 17. ఎడమ కన్ను, 18. శిరస్సు - అనే స్థానాలను స్పృశిస్తూ ఆయాఅవయవాల్లో విరాట్పురుషుణ్ణే

న్యాసం చేసుకోవటం. ఇలాగే కొంచెం భేదంతో శ్రీ సూక్త, మన్యు సూక్త న్యాసాలూ వున్నాయి.

**నమకన్యాసం :**

ఆప్రకారంగా క్రమంగా నమకంతో రుద్రుణ్ణిన్యాసం చేసుకునే విధానం కానరాదు. మహన్యాసంలో నమకంతో న్యాసం వున్నా ఆ విధానం పురుషసూక్త శ్రీ సూక్త న్యాసాలకు లాగా క్రమంగా జరగదు.

పురుష శ్రీ మన్యుసూక్త న్యాసాలనీ, నమకపూజావిధానాన్నీ అనుసరించి నమకం ప్రథమానువాకంలోని 15 మంత్రాలలో వరుసగా 1. శిరసూ, 2. లలాటం, 3. కళ్ళు, 4. చెవులు, 5. ముక్కు, 6. నోరు, 7. కంఠం, 8. హృదయం, 9. బాహువులూ, 10. నాభి, 11. గుహ్యం, 12. తొడలు, 13. మోకాళ్ళు, 14. పిక్కలు, 15. పాదాలు లనే అవయవాల్లో (నమక) న్యాసం చేసుకోవచ్చు.

**నమకన్యాసం :**

| | | | | |
|---|---|---|---|---|
| 1. శిరసి | - | నమ స్తే రుద్ర | - | ఉత తే నమః. |
| 2. లలాటే | - | యాత ఇషుః | - | రుద్ర మృడయ. |
| 3. నేత్రయోః | - | యా తే రుద్ర | - | అభిచాకశీహి. |
| 4. కర్ణయోః | - | యా మిషుం | - | పురుషం జగత్. |
| 5. నాసికాయాం | - | శివేన వచసా | - | సుమనా అసత్. |
| 6. ముఖే | - | అధ్యవోచత్ | - | యాతుధాన్యః. |
| 7. కంఠే | - | అసౌ య స్తామ్రో | - | హేడ ఈమహే. |
| 8. బాహ్వోః | - | అసౌ యో ఉవసర్పతి | - | మృడయాతి నః. |
| 9. హృది | - | నమో అస్తు | - | అకరం నమః. |
| 10. నాభౌ | - | ప్రముంచ ధన్వనః | - | భగవో వప. |
| 11. గుహ్యే | - | అవతత్య | - | సుమనా భవ. |
| 12. ఊర్వోః | - | విజ్యం ధనుః | - | నిషంగధిః. |
| 13. జాన్వోః | - | యా తే హేతిః | - | పరిబ్భుజ. |
| **14. జంఘయోః** | - | **నమ స్తే అస్తు** | - | **తవ ధన్వనే.** |
| **15. పాదయోః** | - | **పరి తే ధన్వనో** | - | నిధేహి తమ్. |

బ్రహ్మమంత్రన్యాసం :

అయితే పురుషసూక్తవిధానంతో ఉపచారాలు (షోడశోపచారపూజ) చేస్తున్నట్లుగానే శివుడికి (పురుషసూక్తవిధానంకంటె) సద్యోజాతాది పంచబ్రహ్మమంత్ర ఖండాలతో ఉపచారాలు చేయడం ఇంచు మించుగా బోధాయనుడు చెప్పిన విధంగా ప్రసిద్ధంగా ప్రచారంలో వుంది. అందువల్ల అంటే (ప్రధానంగా) బ్రహ్మమంత్రాలలో ఉపచారాలు చేస్తూండడాన్ని అనుసరించి యిక్కడ న్యాసంగూడా సద్యోజాతాది బ్రహ్మమంత్రాలతో చేయడం అనే క్రమంలో విశేషం వుంటుంది. మహాన్యాసంలో మూడవన్యాసం అయిదు అవయవాల్లో బ్రహ్మమంత్రాలతోనే చేయడం గమనించవచ్చు. శ్రీ హనుమన్మహావిద్యాప్రకాశికలో పంచబ్రహ్మమంత్ర న్యాసం కొంచెం భేదంతో విస్తృతంగా కనబడ్తుంది. బ్రహ్మమంత్ర ఖండాలు పూజావిధానాని కనుగుణంగా 19 ఖండాలు గాబట్టి 19 అవయవాలలో న్యాసం. పురుషసూక్తన్యాసక్రమం (1-17) తీసుకొని 18వదిగా లలాటం (మూడోకన్ను) 19- శిరసులలో ఈన్యాసం.

-: బ్రహ్మమంత్రన్యాసం :-

| | | |
|---|---|---|
| 1. వామహస్తే | - | సద్యోజాతం ప్రపద్యామి. |
| 2. దక్షిణహస్తే | - | సద్యోజాతాయ వై నమోనమః. |
| 3. వామపాదే | - | భవే భవే న. |
| 4. దక్షిణపాదే | - | అతిభవే భవస్వ మాం. |
| 5. వామజంఘే | - | భవోద్భవాయ నమః. |
| 6. దక్షిణజంఘే | - | వామదేవాయ నమః. |
| 7. గుహ్యే | - | జ్యేష్ఠాయ నమః. |
| 8. నాభౌ | - | శ్రేష్ఠాయ నమః. |
| 9. హృది | - | రుద్రాయ నమః. |
| 10. కంఠే | - | కాలాయ నమః. |
| 11. వామబాహౌ | - | కలవికరణాయ నమః. |
| 12. దక్షిణబాహౌ | - | బలవికరణాయ నమః. |
| 13. ముఖే | - | బలాయ నమః. |
| 14. వామకర్ణే | - | బలప్రమథనాయ నమః. |
| 15. దక్షిణకర్ణే | - | సర్వభూతదమనాయ నమః. |
| 16. వామనేత్రే | - | మనోన్మనాయ నమః. |
| 17. దక్షిణనేత్రే | - | అఘోరేభ్యో... రుద్రరూపేభ్యః. |
| 18. ఫాలే-(తృతీయనేత్రే) | - | తత్పురుషాయ.. ప్రచోదయాత్. |
| 19. శిరసి | - | ఈశాన స్సర్వ... సదాశివోమ్. |

**లఘువిధానం :**

అయినా బ్రహ్మమంత్రాలైదింటితో అయిదు అవయవాల్లో న్యాసం చేసుకునే (బోధాయనోక్తతృతీయాంగన్యాస) విధానం లఘువు. నిత్యాచరణసాధ్యమూ కాబట్టి ఆ ఒక్కదానితో మాత్రమే న్యాసం చేసుకోవడం తేలిక. అంటే (దేవతాస్థాపనాదులు కూడా తగ్గించుకుని అన్నమాట.)

**అంగన్యాస, కరన్యాస, కవచాలు :**

పురుషసూక్తవిధానదేవతార్చనంలో కరన్యాసఅంగన్యాసాలు కేశవాది నామాలతోనూ, కవచమూ, తర్వాత పురుషసూక్తన్యాసం, ఆ తర్వాత అంగన్యాసమూ అనే క్రమం ఆచారంలో వుంది. ఆ క్రమంలో బ్రహ్మమంత్రాలతో ప్రసిద్ధమైన న్యాసం గ్రహించవచ్చు.

| మంత్రం | కరన్యాసం | అంగన్యాసం |
|---|---|---|
| సద్యోజాతం...భవోద్భవాయ నమః. | అంగుష్ఠాభ్యాం - | హృదయాయ |
| వామదేవాయ..మనోన్మనాయ నమః. | తర్జనీభ్యాం -. | శిరసే |
| అఘోరేభ్యో..రుద్రరూపేభ్య ః. | మధ్యమాభ్యాం - | శిఖాయై |
| తత్పురుషాయ..ప్రచోదయాత్. | అనామికాభ్యాం - | కవచాయ |
| ఈశాన స్సర్వ..సదాశివోం. | అనామికాభ్యాం - | నేత్రత్రయాయ |
| త్రియంబకం....మాఽమృతాత్. | కరతల- | అస్త్రాయ |

శ్రీశివకవచం - గ్రంథాంతంలో ఇవ్వబడింది.

అయినా నిత్యం ఇవన్నీ ఆచరించడం కష్టసాధ్యం.

యథావకాశంగా చేసుకోవచ్చు.

# (శివ) అర్చనం

**షోడశోపచారాలు :**

ఉపచారాలు 16 అని ఈ పేరే చెప్తున్నది. ఆ 16 ఏమిటి అనే విషయంలో మతభేదాలు కన్పిస్తున్నాయి.

ప్రథమ విధానం :

**ఆసనం స్వాగతం పాద్య మర్ఘ్య మాచమనీయకం**
**మధుప ర్కాచమన స్నాన వసనాభరణాని చ**
**సుగంధి సుమనో ధూప, దీప నైవేద్య వందనం**
**ప్రయోజయే దర్చాయా ముపచారాం స్తు షోడశ.**

అని తంత్రావర్ణవం చెప్తున్నట్లు శబ్దకల్పద్రుమం. ఇది ఉపచారాలు 16 అని నిర్ణయించి నిర్దేశిస్తున్నది. 1. ఆసనం, 2. స్వాగతం, 3. పాద్యం, 4. అర్ఘ్యం, 5. ఆచమనం, 6. మధుపర్కం, 7. ఆచమనం, 8. స్నానం, 9. వస్త్రం, 10. గంధం, 11. పుష్పం, 12. ధూపం, 13. దీపం, 14. నైవేద్యం, 15. వందనం.

**ధ్యానావాహనాలు :**

పూజ చేసేటప్పుడు అన్ని విధానాల్లోనూ ధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజాం- అనడం సామాన్యంగా ప్రచురం. ధ్యానం ఆవాహనం మొదలైనవి 16 అంటే ఏమిటి పై శ్లోకంలో చూసిన 16 ఉపచారాల్లో ధ్యానం ఆవాహనం అనేవి రెండూ లేవు.

ధ్యాన ఆవాహనాది అంటే - ధ్యానం, ఆవాహనం అనేవి మొదలు - పూర్వంలో కలిగిన షోడశోపచారాలు, ధ్యానావాహనాలు కాకుండా 16. ఇవి రెండూ ఉపచారాలకు పూర్వం ఆచరింపబడేవే కాని ఉపచారాలు కావు.

ఈ రెండూ ఉపచారాలే అయితే ధ్యానాది (షోడశ) ఉపచారాలంటే చాలు, ఆ వాహనం గూడా చెప్పడం ఎందుకు ? ఈ రెండింటిని ప్రత్యేకంగా చెప్పడాన్నిబట్టి గూడా ఇవి రెండూ ఉపచారాలు కావని గ్రహించవచ్చు.

మహారుద్రయాగః అనే(మొ) గ్రంథంలో ఇలాగే (పుట.27, పురుషసూక్త, పుట-49, శ్రీ సూక్త-పుట-48 విధానాలు ఆసనస్వాగతాదులుగానే వున్నాయి. (అయితే అర్ఘ్యం తర్వాత పాద్యం. ఆభరణం బదులు ఉపవీతం వుండటం విశేషం.)

కొంచెం తేడా వున్నా సద్యోజాతాదిమంత్రాలలో రుద్రాభిషేకంలో పూజ చేసేటప్పుడు ఆత్వావహంతు- ఇతి ఆవాహనం, త్ర్యంబక మితి స్థాపనం, చేశాక సద్యోజాతం ప్రపద్యా మీాత్యాసనం దద్యాత్ (పుట.60 చల్లావారి ప్రతి) ఇత్యాదిగా చేస్తున్న ఉపచార విధానంలో మొదటి మంత్ర ఖండంతో ఆసనోపచారం జరగడం గమనించవచ్చు. కాని తర్వాత తర్వాత దీనితో ఆ వాహనం చేయడం ప్రసిద్ధం. కాని స్వాగతం లేదు.

బోధాయనోక్తన్యాసఖండంలో ఆత్వావహం త్విత్యావాహ్య, త్ర్యంబక మితి స్థాపనముద్రాం దర్శయిత్వా, సద్యోజాత మి త్యావాహనం దదాతి. సద్యోజాతాయ వై నమో నమ ఇత్యాసనమ్ అని (పుట23) కనిపిస్తుంది. ఆత్వావహంతు అని ఆ వాహనం చేశాక స్థాపనం గూడా చేసి మళ్లీ సద్యోజాత మని ఆవాహనం చేయడమేమిటి?

ఆత్వావహంతు ఇత్యాదినా ప్రాణప్రతిష్ఠాపనం, త్ర్యంబక మి త్యాసనం, సద్యోజాతం ప్రపద్యా మీాతి పాద్యం, భవే భవే నే త్యర్ఘ్యం, మైసూర్ ప్రతిపుట 59. భవోద్భవాయ నమ ఇ త్యాచమనీయం. అని మరోచోట.

ఆవాహనం అసలు కానరాకపోవడం సద్యోజాతం ప్రపద్యామి. సద్యోజాతాయవై నమోనమః అని మొత్తంతో పాద్యం ఇవ్వడం విశేషాలు (ప్రాణప్రతిష్ఠాపనం ఆవాహనం కంటె భిన్నం గదా.)

ఆసనం దదాతి సద్యోజాత మితి, భవే భవ ఇతి పాద్యం, భవోద్భవాయ నమ ఇ త్యర్ఘ్యం. వామదేవాయ నమ ఇ త్యాచమనీయం అని మరోచోట . ఇలా ఆరంభోపచారాలలో భేదాలు పరిశోధించి సమన్వయింపవలసి ఉంది.

**ఆవాహనం మాత్రం ఉపచారం :.**

తర్వాత సహస్రశీ ర్షే త్యావాహనం ఇత్యాదిగా ఆవాహనం షోడశోపచారాల్లో మొదటిదిగా ఏర్పడింది. ధ్యానం మాత్రం ఇప్పటికీ ఉపచారాల్లో చేరలేదు. కాబట్టి ప్రస్తుతం అనుసరిస్తున్న విధానంలో షోడశోపచారాలు ఆవాహనాదులు. అయినా ధ్యానావాహనాది అనే మాట వెనుకటినుంచి వస్తూవుంది.

షోడశోపచారాలు ఆసనాది అయినపుడు వాటికి పూర్వంలో ధ్యాన ఆవాహనాలు చేయడం జరుగుతుంది. కాబట్టి ఆపద్ధతిలో అది ధ్యాన, ఆవాహన, ఆది - షోడశోపచార పూజ. ఆవాహనాదిగా( అంటే ఆవాహనం ఉపచారాల్లో చేరి) షోడశోపచారాలు చేస్తున్నపుడు ఇది ధ్యానాది షోడశోపచారపూజ.

లేదా పూర్వపద్ధతికి భిన్నంగా ఉపచారాలను మాత్రమే నిర్దేశించదలుచుకుంటే ఆవాహనాది షోడశోపచారపూజలో! ధ్యానం ఉపచారం కాకపోయినా ఆ వాహనాదులకు పూర్వం తప్పకుండా చేయువలసిందేకాబట్టి ధ్యానాది( ధ్యానపూర్వక ధ్యాన పురస్కృత) షోడశోపచారా లనడం యుక్తం.

ఆవాహనం ఉపచారాల్లో చేరిన- యిది షోడశోపచారాల్లో-

**ద్వితీయ విధానం :**

ఇందులో 1. ఆవాహనం, 2. ఆసనం, 3. పాద్యం, 4. అర్ఘ్యం, 5. ఆచమనం, 6. మధుపర్కం, 7. స్నానం, 8. వస్త్రం, 9. ఉపవీతం, 10. గంధం, 11. పుష్పం, 12. ధూపం, 13. దీపం, 14. నైవేద్యం, 15. తాంబూలం, 16.( నీరాజనం, మంత్రపుష్పం) .వందనం.

**ఆవాహనం - స్వాగతమా ?**

ఈఉపచారాలు లౌకికంగా మనయింటికి ఎవరైనా పెద్దలు వచ్చినప్పుడు, వాళ్ళకు మనం చేసే (అతిథి) మర్యాదలను అనుసరించి వున్నట్లు కనబడతాయి. ఎవరైనా మనవాకిట్లోకి వచ్చినపుడు రండి, రండి అని ఆహ్వానిస్తాం. గుమ్మంలోకి వచ్చినవాడు ఇంట్లోకి రాకుండా పోడు గదా అని ఊరుకోం. (వచ్చినవాడితో మనకుండే సంబంధాన్ని అనుసరించి ఆహ్వానంలో, ఆత్మీయతా ప్రదర్శనలో తేడా వుండొచ్చు) అదే స్వాగతం లాంటి దన్నమాట. ఎవరైనా వస్తే రండి కూర్చోండి అని లోపలికి మనవద్దకు రమ్మని ఆహ్వానించడమూ వచ్చాక వారు కూర్చోడానికి ఆసనం ఇవ్వడమూ క్రమం. పై శ్లోకంలో ఆసనం స్వాగతం అన్నపుడు కూర్చోండి రండి అన్నట్లుగా వుంది. లౌకికంగా చూస్తే స్వాగతం ముందు, ఆసనం తర్వాత. స్వాగతం వద్దకు రమ్మని పిలవడం- ఆహ్వానం, మొదటిది. ఆవాహనం అంటే ఇదేనని

చెప్పవచ్చు). ఆవాహనం అంటే ఆహ్వానమని అర్థం. ప్రతిమాదుల్లో దేవతలను సన్నిధి చేసుకోవడమూ ఆహ్వానించడమే. కాబట్టే దేవతలు నిత్యం సన్నిహితమై వుండే సాలగ్రామాదుల్లో కూడా దేవతార్చనలో ఆవాహనం అనే ఉపచారం జరుగుతున్నదని పెద్దలు చెప్తారు.

పైన శ్లోకంలో చెప్పిన స్వాగతం అనే ఉపచారం ఆవాహనం అనే పేరుతో ముందుగా వచ్చింది. అందువల్ల ఈ విధానంలో తర్వాత స్వాగతం లేదు.

**ఆచమనం ఒక్కటే :**

పైశ్లోకంలో ఆచమనం-అర్ఘ్యం తర్వాతా, మధుపర్కం తర్వాతా రెండుసార్లు వచ్చింది. రెండుసార్లెందుకు ? మొత్తం ఉపచారాల్లో చూస్తే ఇంకా స్నానం, వస్త్రం, ఉపవీతం,(ధూప)దీపం, నీరాజనం, నైవేద్యం, తాంబూలం అనే మరో ఏడు సందర్భాల్లో కూడా తర్వాత ఆచమనం వస్తున్నది. అన్నీ ప్రత్యేకంగా చెప్పడం లేదు. (చెప్తే 8 చెప్పాలి. అందువల్ల మొదటిసారి మాత్రం (సమంత్రకంగా) ప్రత్యేకంగా చెప్తే తర్వాత ఆయాఉపచారాలకు అంగంగా వాటికి తర్వాత (ప్రత్యేక మంత్రం లేకుండా) చేయడం సక్రమమే నని ప్రత్యేకంగా వున్న ఆచమనం (అర్ఘ్యం తర్వాత, స్నానాదులకు వలె అర్ఘ్యానికి అంగం కాని) ఒక్కటే ఈ విధానంలో స్వీకరింపబడింది. మధుపర్కం తర్వాత ఆచమనం తొలగింపబడింది. మొత్తంమ్మీద (సమంత్రకంగా) ఆచమనం ప్రత్యేకోపచారంగా ఒక్కటే.

**ఆభరణం - ఉపవీతం :**

ప్రథమవిధానంలో ఆభరణంగా వున్న (10) ఉపచారం ఇందులో ఉపవీతంలో కనబడుతుంది. ఈ విధానంలో ఉపవీతం దగ్గరే ఇతరాభరణాలు కూడా ఇవ్వడం జరుగుతుంది. పుష్పంతోపాటు ఇచ్చేపద్ధతీ వుంది. మధుపర్కం లేని విధానంలో ఉపవీతంతో పాటు గంధం తర్వాత, ఆభరణం ప్రత్యేకోపచారంగా వుంది.

**తాంబూలం విశేషం :**

మొదటి విధానంలో తాంబూలం ప్రత్యేకోపచారంగా లేదు. అంటే ప్రత్యేకమంత్రం లేకుండా నాభ్యా ఆసీ దితి నైవేద్యం-తాంబూలం చ, (మహారుద్రయాగః) అని నైవేద్యంతోపాటే తాంబూలం. (స్నానాంగంగా

(ఆచమనంలాగా) ప్రత్యేకమంత్రంతో ఇది తర్వాత ప్రత్యేకోపచారం అయింది. గంధపుష్పధూపదీపనైవేద్య తాంబూలాద్యుపచారాన్ అనీ, పంచపూజలో సం-తాంబూలాది సర్వోపచారాన్ అనీ, మొదలైనవ్యవహారంలో తాంబూలం ప్రత్యేకంగా వుంది.

నీరాజనం విషయం తర్వాత చూద్దాం.

**మంత్రపుష్పం-వందనం :**

ధాతాపురస్తా దితి మంత్రపుష్పం అని మంత్రపుష్పం అనేది సమంత్రకంగా ఇవ్వబడుతుం దీవిధానంలో. మొదటి విధానంలోని వందనం అనే చివరి ఉపచారం ఇక్కడ ప్రత్యేకమంత్రంతో చేయబడడం లేదు. (బ్రహ్మమంత్ర విధానంలో మంత్రఖండాలు 19. తత్పురుషాయ అని మంత్రపుష్పం, ఈశానస్సర్వ అని ప్రదక్షిణనమస్కారాలు ప్రత్యేకంగా వున్నాయి.) మంత్రపుష్పంలోనే చివర ఈశాన స్సర్వ - చెప్పి నమస్కారం చేయడం జరుగుతున్నది. మంత్రపుష్పమే పుష్పాంజలి. అక్కడే నమస్కారం. అది ప్రదక్షిణపూర్వకం కాబట్టి మంత్రపుష్పం లేదా పుష్పాంజలి అనే యిది (ఆత్మప్రదక్షిణ) నమస్కారం అనే ఉపచారం అవుతున్నది.

**తృతీయవిధానం :**

**ఆవాహ నాసనం పాద్య మర్ఘ్య మాచమనీయకం**
**స్నానం వస్త్రోపవీతం చ గంధ మాల్యానుక్రమాత్**
**ధూపం ధీపం చ నైవేద్యం తాంబూలం చ ప్రదక్షిణా**
**పుష్పాంజలి రితి ప్రోక్తా ఉపచారా స్తు షోడశ.**

పూర్వవిధానంలోని మధుపర్కం అనే ఉపచారం పోయి, ప్రదక్షిణ మనేది చేరింది. ఇందులో మధుపర్కం ఎందుకు తొలగిపోయింది ?

అసలు మధుపర్కం అంటే ఏమిటి ?

మధుపర్కం :

దధిమధుసంస్పృష్టం. పెరుగు **తేనె కలిసినది** మధుపర్కం. షోడశోపచారాల్లోని మధుపర్కం - ఆజ్యం దధి మధుమిశ్రం **మధుపర్కం** విదుః అని పెరుగు, **తేనె**లతో నెయ్యి గూడా **కలిసింది మధు**పర్కం అని తంత్రసారం (అని శబ్దకల్పద్రుమం)

**దధి సర్పి ర్జలం క్షౌద్రం సితైతాభి స్తు పంచభిః**
**ప్రోచ్యతే మధుపర్క స్తు సర్వదేవౌఘతుష్టయే.**

చక్కెర తక్కువగానూ, పెరుగూ నేయీ సమంగానూ, తేనె అధికంగాను అంతటా జలం వుండేటట్లుగానూ కలిసినపదార్థం మధుపర్కం అని కాలికాపురాణం (సమేమధుసర్పిషీ విషం- తేనె నెయ్యి సమంగా కలిపితే విషం అవుతుంది.)

**దధిగుడసహితం మధుప్రకీర్ణం**
**సఘృతసమన్వితధేనుదుగ్ధయుక్తం**
**శుభకరమధుపర్క మాహర త్వం**
**త్రినయన ! మృత్యుంజయ! లోకవంద్య !**

అన్న శ్లోకంలో చక్కెర బెల్ల మైనా నీళ్ళు పోయి, ఆవుపాలు కూడా కలిశాయి.

**మధ్వాజ్యక్షీరమిలితం శర్కరా, దధిసంయుతం**
**అర్పయే మధుపర్కం తే స్వీకురు త్వం దయామయ !**

అన్నపుడు చక్కెర అలాగే వుంది. మొత్తంపై పంచామృతాలనబడే పదార్థాలన్నీ ఒకచోటికి వచ్చాయి.

పంచామృతాలు :

**దుగ్ధం సశర్కరం చైవ ఘృతం దధి తథా మధు**
**పంచామృత మిదం ప్రోక్తం విధేయం సర్వకర్మసు.**

అని శబ్దకల్పద్రుమం. (ఆవు) పాలు, పెరుగు, నెయ్యి, తేనె, చక్కెర, (పటికబెల్లం) అనేవి అయిదూ పంచామృతాలు. మధుపర్కం పదార్థాలకూ వీటికీ సామ్యం చాల వుంది. (మధుపర్కంలో పాలు చక్కెర కలిస్తే పంచామృతమే) దీనివల్లనే యివిరెండూ క్రమంగా అభిన్నాలయి మధుపర్కం పంచామృత మయి అది పంచామృతస్నానం అయిందేమో. ఫలరసం పంచామృతాల్లో ఒకటనీ చక్కెర ఇందులోది కాదనీ కొందరంటారు. ఆంధ్రవాచస్పత్యం ప్రకారం చక్కెర లేదు గానీ ఫలరసం కూడా లేదు. శుద్ధోదకం పంచామృతాల్లో చేరింది. ఇపుడు పంచామృత(స్నాన)ం అంటె కొబ్బరినీళ్ళు అని మాత్రమే అర్థంగా కూడా వ్యవహారంలో కనిపిస్తున్నది.

మధుపర్కం స్వరూపవిషయంలో భేదాలున్నా మొత్తమ్మీద ఇది ఆహారంగా స్వీకరించే పదార్థం కావడం పద్ధతి.

**+ మధుపర్కం ఎందుకు ?**

మనయింటికి వచ్చిన అతిథికి కాళ్ళూ చేతులూ కడుక్కున్న తర్వాత కాస్త మంచినీళ్ళు (ఆచమనం) ఇచ్చి ఆ తర్వాత స్నానానికి సిద్ధం అయ్యేలోపుగా టిఫిన్ కాఫీ వంటి పదార్థం ఇవ్వడం లాంటి దీ మధుపర్కోపచారం. స్నానానికి పూర్వమె తినడం పద్ధతేనా ? ఆ పద్ధతిలో మనం గూడా స్నానానికి ముందేదైనా మధురపదార్థాలు పుచ్చుకోవచ్చా ? అని సందేహం కలుగుతుంది. ఇదంతా ఎందుకు లెమ్మని మధుపర్క ఉపచారం తొలగిపోయిందేమో.

మధువుతో కలిసిన యీ పదార్థం మందులాంటిదనీ, శ్రమవల్ల కలిగే నీరసాన్ని తొలగించడానికీ, జీర్ణకోశానికి స్వాస్థ్యం పెంపొందించడానికీ ఉపయోగించేదే కాని టిఫిన్ వగైరాలాగా కడుపునింపుకునే పదార్థం కా దనీ విజ్ఞులంటున్నారు. ఎండలో వచ్చిన అతిథికి మంచినీళ్ళతోపాటు (లేదా బదులుగా) మజ్జిగతేట ఇవ్వడం లాంటి దన్నమాట. ఏమైనా మందులాంటిదనో, మర్యాదాదిసూచకమో అయిన ఈ ఉపచారం, చేయవలసినదే అని వృద్ధులనిశ్చయం.

**మధుపర్కం - పంచామృతస్నానం :**

మధుపర్కోపచారం వద్ద ముందుగా తినడానికి ఇచ్చి తరువాత అక్కడే పంచామృతస్నానం చేయించడమూ ఒక్కొక్క చోట సరాసరిగా పంచామృతస్నానం చేయించడమూ రెండు పద్ధతులు కనబడుతున్నాయి. మధుపర్కంపదార్థం పంచామృతా లయ్యాక అది క్రమంగా పంచామృతస్నానం అయివుండాలి.

**జలం తు సర్వతః, స్వల్పం సితా, దధిఘృతం సమం,**
**సర్వేషా మధికం క్షౌద్రం, మధుపర్కే ప్రయోజయేత్.**

*+ కొందరు మధుపర్కంగా వస్త్రం ఇవ్వడం గూడా వున్నట్లు తెలుస్తున్నది. వివాహప్రక్రియ ననుసరించి మెల్లమెల్లగా పూర్వోత్తర సందర్భాలను వదిలి మధుపర్కం అనేది వస్త్రం అనే అర్థంలో స్థిరపడడమూ, అందువల్ల మధుపర్కంగా వస్త్రం ఇవ్వడం ఆధునికంగా జరుగుతుండి వుండొచ్చు దీనికి ప్రమాణం మృగ్యం.*

జలం తు సర్వతః-కాబట్టి పంచామృతస్నానాల్లో ప్రతిసారీ శుద్ధోదకస్నానం చేయించడం జరుగుతున్న దేమొ.

కాని మధుపర్కం అంటే ఈఅయిదువస్తువులతో స్నానమే అయితే దానిని స్నానాంగంగా నిర్వహించడం న్యాయం. పంచామృతస్నానాన్ని (ఒకమంత్రంతో) శుద్ధోదకస్నానాన్నీ (మరో మంతంత్రంతో) వేర్వేరు ఉపచారాలుగా విడదీయడం ఎందుకు అని మధుపర్కం తొలగిపోయిం దేమొ. రుద్రాభిషేకంలో మధుపర్కం లేకుండా పంచామృతస్నానం వుంది. స్నానపూర్వం ప్రత్యేకంగా కాక, (స్నానమంత్రం తర్వాత) స్నానసంకల్పంతో తదంగంగా చేయటం తగు ననిపిస్తున్నది.

దధి మధు ఆజ్య త్రయ సంయుక్తంగా మధుపర్కంగా, అదీ ఖాద్యంగా, ఉండడమె ప్రామాణికంగా కనబడ్తున్నది.

**పంచామృతస్నానం :**

అసలు పంచామృతాలతో స్నానమే విశేషం. ఈ విధానం ఎందుకు ఎలా ఏర్పడిందో ! ఆహారంగానూ, స్నానంగానూ ఇచ్చే విధానంలో ముందు ఆహారంగా ఇచ్చి తర్వాత మళ్లీ ఆ అయిదువస్తువులతోనె స్నానం గూడ చేయించడమేమిటి ? రెండువిధాల వాడకం విచిత్రం. స్నానాలయినపుడు లౌకికమైన స్నానంలో నలుగుపెట్టుకోవడం వంటిదవుతుందా ? తేనెతో స్నానం వింతగా ఉందనక తప్పదు. రుద్రాభిషేకంలో పుష్పోదకాదులతో విశేష స్నానాలున్నాయి. ఇవీ అటువంటివేనా ?

పూజలో ఆచమనపాత్ర, అర్ఘ్యపాత్ర వగైరాల లాగా స్నానపాత్రకు భిన్నంగా పంచామృతపాత్ర వుంటుంది. మధుపర్కం పంచామృతాలుగా పరిణతమైనా, అమృతాలు (ఆయామంత్రాలతో) అయిదూ ఒక పాత్రలో కలిపి ఆ మధుసంపృక్త పదార్థాన్ని తినడానికి ఇవ్వడం సంప్రదాయంగా, ఉండాలి. ఆ ఇవ్వడమె స్నానం అయి మధుపర్కం పంచామృతస్నానం అయిందా ? మధుపర్కం అన్నీ కలిసినపదార్థం. పంచామృతాలను కలిపి కాకుండా దేనికి దానిని, విడివిడిగా వెంట వెంట శుద్ధోదక స్నానంతో ఇవ్వడం విశేషం. కొన్ని సందర్భాలలో పంచామృతస్నానం కనబడదు.

పంచామృతాలు(కలిసి) ఆస్వాద్యంగా ఇవ్వవలసి ఉందనీ, స్నానంగా కాకపోవచ్చునీ మామూలుగా అనిపిస్తుంది. దీన్ని గురించి వివరంగా తెలుసుకోవాలి.

స్నానంగా అయినా, పంచామృతస్నానం మధుపర్కం (దధి మధు ఆజ్యాలు). ఇచ్చాక స్నానాంగంగా (స్నానమంత్రంతో) ఉండడం సక్రమమని నిశ్చయించవచ్చు.

**ప్రదక్షిణం- ప్రత్యేకోపచారమా ?**

మొత్తమ్మీద ఈమూడో విధానంలో మధుపర్కం లేదు. చివర్లో ప్రదక్షిణం అనేది చేరడంతో ఉపచారాలు 16 సరిపడ్డాయి. కాని ప్రదక్షిణం ప్రత్యేకోపచారంగా చెప్పడం అవసరమా ? ఇది నమస్కారానికి పూర్వావయంగా వందనోపచారంతో సంగ్రహింపబడుతుంది గదా. వ్యవహారంలో ఇదే విధంగా ఆత్మ ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి అని ఉన్నది. పురుషసూక్తాది పూజావిధానంలో ప్రదక్షిణాన్ని ప్రత్యేక మంత్రంతో చేయకపోవడం గమనించవచ్చు. నమస్కారానికీ లేదు.

ప్రదక్షిణం ప్రత్యేకోపచారం గాకుండడం తప్పు కాదు.

**మరోవిధానం- ఆభరణం :**

ఇంకో విధానంలో ఇపుడు మధుపర్కంతో పాటు ప్రదక్షిణం గూడా లేకుండా ఆభరణం చేరింది గంధం తర్వాత. మధుపర్కం ఉంటే ఆభరణం లేకుండా, మధు పర్కం లేకుంటే ఆభరణంతోనూ ఉండే పూజావిధానాలు రెండే ఇపుడు **నిత్యపూజా**క్రమంలో తరుచుగా ఆచరింపబడుతున్నాయి.

**నీరాజనం- వందనం :**

వందనం అన్నివిధానాల్లోనూ ఉంది. కాని అది ప్రత్యేకమంత్రంతో (బ్రహ్మమంత్రవిధానం తప్ప) ఆచరింపబడడం లేదు. ఇంక దాదాపుగా అన్ని సంప్రదాయాల్లోనూ పేర్కొనబడక ఆచరింపబడుతున్నది నీరాజనం. ఈ నీరాజనమే వందనం అవుతుందా ?

**మంత్రహీనం క్రియాహీనం మత్కృతం పూజనం హరేః**
**సర్వం సంపూర్ణతా మేతి కృతే నీరాజనే శివే.**

**షోడశోపచారపూ**జంతా అయ్యాక అందులో ఉండే లోపాలను పరిహరించి, **సంపూర్ణత**ను సంపాదించే యీ నీరాజనం(ఆరాత్రికం- ఆరతి- హారతి) **షోడశోపచారాలకు భిన్నమైనది** కావచ్చు మొదట్లో. అంటే వందనం అనే ఉపచారం

కూడా అయింతర్వాత నీరాజనం. నీరాజనం (హారతి ఇవ్వడం, మంగళం పాడడం,) **అనేమాట** పరిసమాప్తి అనే అర్థంలో వ్యవహారంలో గమనిస్తాం.

కాని యీవిధానంలో నీరాజనం మంత్రపుష్పం- అంటే వందనానికి పూర్వం లో ఏర్పడడం విశేషం.ఇది ఉపచారం అవుతుందా కాదా అనే అంశం పెద్దలవల్ల తెలుసుకోవలసి వుంది.

**ఉపచారాలు ఎన్ని ?**

నీరాజనం అనేది యీపూజావిధానాలలో ప్రత్యేకమంత్రంతో చేయడం జరుగుతున్నది. ఇది గూడా ప్రత్యేక ఉపచారం అయితే ఉపచారాలు 17 అవుతాయి. పురుషసూక్తంలో 18 మంత్రాలలో (యజ్ఞేన అనే చివరిది ఉద్వాసనకు పోగా) మిగిలినవి 17 కావడంతో ఉపచారాలు 17 అయ్యాయి. 15 ఋక్కులే వున్నా శ్రీ(మన్యు) సూక్తం విధానంలోనూ మధుపర్కం (ఆభరణం) లేకుండా తాంబూల నీరాజనాలు మాత్రం ప్రత్యేకంగానే వున్నాయి.

నీరాజనమంత్రపుష్పా(ఆత్మ ప్రదక్షిణ నమస్కారా)లు ఒకే ఉపచారంగా తీసుకోవచ్చా. నీరాజనం తాంబూలాంగంగా చెప్పవచ్చు. ఖాద్యం అయిన మధుపర్కం (ప్రత్యేక మంత్రం ఉన్నా) ప్రత్యేకోపచారం కాకుండా ఆచమనాంగం అవుతుందా ?

ధ్యానావాహనాదిషోడశోపచార పూజ లనే వ్యవహారాన్ననుసరించి ఆవాహనం ఉపచారం కాదని తాంబూల నీరాజనాలు రెండూ వేరుగా గ్రహించాలా ? అనే అంశాలను ఉపచారాలు 16 అనే పరిమితికి లోబరచవలసిన పక్షంలో విచారించాలి. ఏవిధానం ప్రకారం పూజ చేసినా, చేయవలసిన ఉపచారాలకు మంత్రం చెప్పడం సక్రమం, కాని మన మెన్నుకొన్న (పురుషసూక్తాది) విధానంలో ఉండే మంత్రాలసంఖ్యనుబట్టి ఉపచారాలు సంగ్రహించడం ఎలా? పురుషసూక్తంలో 17 వుంటే ఉపచారాలు పదిహేడయి, శ్రీ సూక్తం ప్రకారం 15, మన్యుసూక్తంప్రకారం 14, బ్రహ్మమంత్రఖండాల ప్రకారం 19 ఇలా భిన్న భిన్నాలుగా వుండడ మెలా ?

**ప్రస్తుత గ్రంథంలో** మధుపర్కం ఆచమనాంగంగా తీసుకొని ఉపచారాలను **16గా చూపడం జరిగింది.**

రావణోక్తన్యాసఖండంలో అథ సంప్రార్థ్య దేవేశం - సద్యోజాతాది పంచభిః
మంత్రైః షోడశధా భక్తైః షోడశా నుపచారకాన్
ఆసనాది నమస్కారపర్యంతాన్ పరిపూజయేత్.

అని ఉపచారాలు 16గాను అవి ఆసనాది నమస్కారాంతాలుగాను చెప్పబడ్డాయి. బోధాయనుడు చెప్పిన ఆసనాది నమస్కారపర్యంత ఉపచారాలు 18 అయ్యాయి. పంచబ్రహ్మమంత్రాలు 16ఖండాలుగా విభాగించడము విచారించ వలసిందే.

మొత్తంపై షోడశ-ఉపచారాలు అనే విషయంలో పెద్దలతో విచారించి యథార్థం గ్రహించవలసివుంది.

**షోడశోపచారాలు - క్రమం :**

ఇంక ఈ ఉపచారాలను ప్రయోగించడంలోని క్రమంలో గూడా కొంచెం భేదం కన్పిస్తున్నది.

మొదటి విధానంలోని స్వాగతం ఆవాహనం అనే పేరుతో ముందుకు వచ్చిందనుకున్నాం.

**ఆసనం-పాద్యం :**

మామూలుగా అయితే అతిథిని రండి అని ఆహ్వానించి లోపలికి కాళ్ళు కడుక్కొని రమ్మనడం, ఆతర్వాత వచ్చి కూర్చోవడం సాధారణం. తిరిగి తిరిగి వచ్చిన కాళ్ళతో ఇంట్లోకి రావడం ఆరోగ్యం కాదని ఈమర్యాద. కాని పూజ్యులయినవాళ్ళని లోపలికి ఆహ్వానించి కూర్చోబెట్టి స్వయంగా పాదాలు కడగడం మర్యాద. కాబట్టి ముందుగా ఆసనం ఇచ్చి పాద్యం ఆ తర్వాత ఇవ్వడం క్రమం. నీళ్ళు ఇవ్వడం కాదు. పాద్యం ఇవ్వడమంటే ఆ నీళ్ళతో స్వయంగా స్వామిపాదాలు కడుగుతున్నట్లుగా భావన చేయాలి. అలాగే అర్ఘ్యం విషయంలోనూ.

**పాద్యమా ? అర్ఘ్యమా ? ఏది ముందు ?**

పాద్య మర్ఘ్యం అని పై శ్లోకంలో మొదట పాద్యమూ తర్వాత అర్ఘ్యమూ వున్నాయి. కాని కొన్ని చోట్ల ముందుగా అర్ఘ్యం ఇచ్చి తర్వాత పాద్యం ఇవ్వడం అనే

విధానమూ కనిపిస్తున్నది. శ్రీ చక్రపూజ మొదలైన కొన్నివాటిల్లో ఇది కొందరి సంప్రదాయంలో ఇప్పటికీ వుంది.

(కాళ్ళు కడుకున్న తర్వాతనే చేతులు కడుక్కోడం క్రమం) పూజ్యతను అనుసరించి గూడా పాదప్రక్షాళనం అధికగౌరవసూచకంగా ముందు చేయడం. ఆతర్వాతనే హస్తప్రక్షాళనం చేయడం ఉచితం. పాద్యం కంటె అర్ఘ్యం ఇంకా సుగంధ్యాది లక్షణాలు అధికంగా కలిగిన దైవుండాలనే మాటకూడా పాద్యానికి తరువాతిదే అర్ఘ్యం అని సూచిస్తుంది. పాద్యాదిజలాలు పరస్పరం భిన్నంగా వేర్వేరుగా ఉంచడం సంప్రదాయం కూడా.

**పంచామృతస్నానం, శుద్ధోదక స్నానం :**

మధుపర్కం ఖాద్యంగా ఇచ్చే పద్ధతే ఉచితంగా వుందనీ మధుపర్కం దగ్గర పంచామృతస్నానం చేయించడం కంటె (చేయించదలచుకున్నపుడు) స్నానాంగంగా స్నానమంత్రంచేతనే చేయించే విధానం బాగుందనీ అనుకున్నాం.

ఇక్కడ కూడా పంచామృతస్నానం అయ్యాక శుద్ధోదకస్నానం చేయడమూ, శుద్ధోదకస్నానం అయ్యాక పంచామృత స్నానం చేయడమూ అని రెండు విధానాలు కనబడుతున్నాయి. కాని యీ రెంటిలో మొదటి విధానమే మేలు, పంచామృతస్నానాంతరం శుద్ధోదకస్నానం సమర్పించవలసిందే కదా.

**ఆభరణం :**

(మధుపర్కం వున్నపుడు) పురుషసూక్తాది విధానంలో ఇది ప్రత్యేక (మంత్రంతో) ఉపచారంగా చెప్పబడలేదు. ఆ పద్ధతిలో ఉపవీతాంగంగా ఉపవీతం తర్వాత ఇవ్వడమూ, పుష్పం తర్వాత ఇవ్వడమూ, అని రెండు విధాలుగా కనబడ్తుంది. మధుపర్కం ఇవ్వని విధానంలో గంధం తర్వాత, పుష్పానికి పూర్వంలో ఆభరణం ఇవ్వడం జరుగుతున్నది. సద్యోజాతాది విషయంలో బోధాయనుడు శ్రేష్ఠాయ నమ ఇత్యుపవీతం, రుద్రాయ నమ ఇత్యాభరణం అని ఉపవీతం తర్వాత ఆభరణం చెప్పడం జరిగింది. అదే ఉచిత మేమో అనిపిస్తుంది. (రుద్రుడికి ఆభరణా లెందుకని కాబోలు కొందరు రుద్రాయ నమః అనే దాని ప్రకారం భస్మం చెప్తున్నారు. ఇది బాగానే వుంది. లోకంలో ఆభరణాలు తగిలించుకునే విధానం వస్త్ర(ఉపవీత)ం

తర్వాతే కనిపిస్తుంది. గంధం తర్వాత ఆభరణాలు వేసుకుంటే (లేదా వేస్తే) గంధం చెరగవచ్చు. అలాగే పుష్పమాల గూడా ఆభరణమె. స్వర్ణాద్యాభరణాలపై పుష్పమాల లుంటాయి.(వాడితే తీసివేయవలసినవి. స్వర్ణాభరణాల్లాగా శాశ్వతమైనవి కావు) అలాగే సిగలో పూలు అయినా ఆ తర్వాత ఆభరణాలు వేస్తే పూలు చెదురుతాయి. కాబట్టి ఆభరణం తర్వాతనే గంధం సక్రమ మనిపిస్తుంది. ఈ గంధం సుగంధద్రవ్యంగా మై పూత అయితే ఒంటికి సెంటులాగా ముందు గంధం పూసి తర్వాతే ఆభరణాలు ఇవ్వవలసి వుంటుంది. కాని యీ గంధం బొట్టే. గంధోపరిఅక్షతాదులిస్తాం గదా-గంధద్రవ్యాలు - మై పూతలు ఇవ్వదలిస్తే వాటిని ఆభరణాలతో పాటు వాటికి ముందుగా ఇవ్వవలసిందే. మీద చల్లుకొనేలాంటివి గంధం తర్వాతనే. పుష్పం వర్ణ పుష్పాదులతో పూజ మాత్రమే. అపుడు పూమాలలే అయినా వేస్తే కిరీటాదులతోటి, గంధం తోటీ అవస్థే.

అంచేత ఆభరణం ఉపవీతం వెంటనే ఇచ్చే విధానమే సముచితంగా ఉందనవచ్చు.

ఇక ఇతర ఉపచారాలక్రమంలో అంతగా మతభేదాలు లేవు.

**ఉపచారవిధానం :**

ఈ ఉపచారాలను పురుషసూక్తం మొ॥ ఆయా మంత్రాలతో ఆచరించడం జరుగుతున్నది. ఆ సందర్భంగా అందులోని మంత్రఖండాల కనుగుణంగా ఉపచారాలు (సంఖ్య) ఉండడం గూడా గమనించవచ్చు. (బ్రహ్మమంత్ర ఖండాలు 19, పురుషసూక్తం ప్రకారం 17- ఇలా.

శివార్చనం ప్రధానంగా బ్రహ్మమంత్రాలు ఆధారంగానూ తర్వాత నమకం(ప్రథమానువాకం) ఆధారంగానూ జరుగుతుంది. పురుషదేవత లందరికీ సామాన్యమైన విరాడ్రూపవర్ణ నాత్మక పురుషసూక్త మంత్రాలతో గూడ శివపూజ జరుగుతుంది. స్త్రీదేవతల విషయంలో శ్రీ సూక్తం, ఆంజనేయాది పూజలలో మన్యుసూక్తం, ఇలా ఉపయోగించడం జరుగుతున్నది. వీటిని ఉపయోగించడంలో వ్యక్తి ననుసరించి గూడా భేదాలు ఏర్పడివుండడం విశేషం. (ఇందులో 5 విధానాలు- కలిపి ఇవ్వబడింది. కావలసిన దాని నుపయోగించుకోవడానికి వీలుగా)

మంత్రోపచారాల సంబంధం :

మంత్రానికీ ఆ మంత్రంతో చేసే ఉపచారానికీ సంబంధం వుందా ?

ఉదాహరణకి ఆసనాదిగా ఉపచారాలున్న (మొదటి) విధానంలో నమస్తే రుద్ర ఇత్యాసనం, ఇలాగే సహస్రశీర్షే త్యాసనం, హిరణ్యవర్ణామిత్యాసనం ఇత్యాది విధానంలో పై మంత్రాలు ఆవాహనానికి ఉపయోగింపబడుతున్నాయి. బ్రహ్మమంత్రాల విషయంలోనూ

సద్యోజాతం ప్రపద్యా మీా త్యాసనం దద్యాత్, సద్యోజాతాయ వై నమో నమ ఇతి పాద్యం, భవే భవే నాతిభవే భవస్వ మా మిత్యర్ఘ్యం -(60పుట) అని ఒకసారీ సద్యోజాత మి త్యావాహనం దదాతి, సద్యోజాతాయ వై నమో నమ ఇ త్యాసనం, భవే భవే నేతి పాద్యం, (అతి) భవే భవస్వ మా మి త్యర్ఘ్యం -(23పుట) అనే విధంగా వీటి ప్రయోగంలో భేదం గమనించవచ్చు.

ఆత్వావహంతు ఇత్యాదినా ప్రాణప్రతిష్ఠాపనం. త్ర్యంబక మి త్యాసనం. సద్యోజాతం ప్రపద్యా మీాతి పాద్యం. భవే భవే నే త్యర్ఘ్యం, భవోద్భవాయ నమ ఇ త్యాచమనీయకం (59-మైసూరుప్రతి) దీనిప్రకారం సద్యోజాతం ప్రపద్యామి సద్యోజాతాయ వై నమో నమః అనే మొత్తంతో పాద్యం. భవే భవే నాతిభవే భవస్వ మాం అనే మొత్తంలో అర్ఘ్యం ఇవ్వాలి. జ్యేష్ఠాయ నమః అని స్నానం ఇత్యాదిగా, భేదాలు కనబడుతున్నాయి.

మంత్రానికీ దానితో చేసే ఉపచారానికీ సంబంధం వుంటే ఇలాగా ఆయా మంత్రాలచేత వేర్వేరు ఉపచారాలు చేయడం కుదురుతుందా అని సందేహం. అందువల్లే యత్పురుషే ణేతి మధుపర్కం, సప్తాస్యాసన్నితి స్నానం- ఇత్యాదిగా ఒకవిధానం అయితే యత్పురుషే ణే తి స్నానం ఇత్యాదిగా మరొకవిధానం మధుపర్క-స్నాన, వస్త్ర, ఉపవీత, గంధాలు-స్నాన, వస్త్ర, ఉపవీత, గంధ, ఆభరణాలు అనే అయిదింటిలో మంత్రాలు తేడా వస్తాయి.

స ప్తా స్యాస న్నితి నీరాజనం ఇచ్చి వే దాహ మేతం, ధాతా-పురస్తాత్ అని రెంటితో నమస్కారం లాగా యి.కె.గారి పురుషసూక్తప్రకార షోడశోపచార విధానంలో మరో భేదం.

ఆదిత్యవర్ణే అని మధుపర్కం ఇస్తే శ్రీ సూక్తంలోనూ మంత్రాలలో భేదా లేర్పడతాయి.

కాబట్టి మంత్రానికీ ఆ మంత్రంతో చేయబడే ఉపచారానికీ పరస్పరం సంబంధం ఎంతటిది అనే విషయం పెద్దలవల్ల తెలుసుకోవలసి వుంది.

బ్రహ్మమంత్రవిధానం :

సద్యోజాతాదిబ్రహ్మ మంత్రాలతో శివుడికి ఉపచారాలు చేయడం మహాన్యాసంలో బోధాయనోక్తం ప్రసిద్ధం. కొంచెమించుమించుగా 19 ఖండాలతో 19 ఉపచారాలు పై 16తో పాటు (ఆభరణం)అక్షతలు నమస్కారాలకు వేరే మంత్రాలు వచ్చాయి.

ఇందులో కొన్నిచోట్ల వ్యవహారంలో పాద్యానికీ భవే భవే నాతి అనీ, అర్ఘ్యానికి భవే భవస్వ మాం అనీ చెప్పడం జరుగుతున్నది. అర్థాన్నిబట్టి చూస్తే (భవే-భవే= పలుజన్మలలో (మాం=నన్ను) న(భవస్వ)= ఉంచకు, పడవేయకు: అతిభవే = జన్మకు అతీతమైన-పుట్టుకలేని-స్థితిలో, మాం=నన్ను, భవస్వ= ఉంచు) భవే భవే అనేంత వరకూ ఒక ఖండగా పాద్యమంత్రమూ అతిభవే భవస్వ మాం అనేది మరోఖండంగా అర్ఘ్యమంత్రంగానూ చెప్పున్నపద్ధతి యుక్తం. భవే భవే నేతి పాద్యం అనే పాఠంలో సామ్యాన్నిబట్టి భవే భవే నాతి అని గ్రహించి అతిశబ్దం ముందే వచ్చిందని తర్వాత ఖండంలో దాన్ని తొలగించి భవే భవస్వ మాం అనేది మాత్రం గ్రహించడం ప్రామాదికంగా జరిగిందేమొ ఈవిధానంలో శివోపచారాల్లో మధుపర్కం లేదు. పురుషసూక్తప్రకారంగా ఉపచారాలు చేసేటప్పుడు మధుపర్కం ఇవ్వడం జరుగుతున్నది, మంత్రాన్ని బట్టి ఉపచారమా ? ఉపచారాన్నిబట్టి మంత్రమా? తెలుసుకోవాలి.

నమకవిధానం :

నమకంలోని ప్రథమానువాకం శివపూజావిధానంలో ప్రయోగించడం జరుగుతుంది. ఇందులో 15మంత్రాలే వున్నాయి. నమ స్తే అస్తు భగవన్ అనేది 16వదిగా మంత్రపుష్పంలో చెప్పడం వల్ల ఇవి 16 అయ్యాయి. పురుషసూక్త విధానంలో 17 వున్నాయి కదా. మధుపర్కం అధ్యవోచత్-అనే మంత్రంతో ఇస్తే ఇంకా ఒకటి తగ్గుతుంది. అసౌ య స్తామ్రో అనేదాన్ని అభితో దిక్షు అన్నంతవరకు

అపి శ్రితా స్సహస్రశః విలోహితః అన్నంతవరకు ఒకటి చేసి మొత్తం రెండింటిని 3గా చేయడం ద్వారా సరిపుచ్చడం కనిపిస్తుంది. (శ్రీమదుమామహేశ్వర పూజ) దిక్షు- వరకు 2వదిగా విభాగం కనబడ్తున్నా అక్కడికి వాక్యార్థం పూర్తిగాదు. తరువాతి వాక్యం గూడా మధ్యలో విరిగిపోతున్నది. కాబట్టి ఈ విభాగం ఎంతవరకు యుక్తమొ చెప్పవీలులేకుండ వుంది. దీనికంటె మధుపర్కోపచారాన్ని మానుకోకపోయినా మంత్రం లేకుండా ఆచమనంతోపాటె ఇవ్వడం మేలు గదా అనిపిస్తుంది.

ఇంకా కొంచెం తేడాతో భేదాలున్నా అవన్నీ స్మరింపదగినవిగా కనబడ్డం లేదు.

**పురుషసూక్త విధానం :**

షోడశోపచారపూజ పురుషసూక్త విధానంతో సుప్రసిద్ధం. విరాడ్రూప వర్ణనాత్మకం కాబట్టి సర్వ దేవతాసామాన్యంగా ఈ విధానం ఉపయోగిస్తుంది. స్త్రీ దేవతాపూజలో గూడా ఇది శ్రీ సూక్తవిధానంతో పాటు ఉపయోగించడం ఉంది.

ఇందులోనూ మధుపర్కం ఉండి ఆభరణం లేకపోడం, ఆభరణం ఉండి మధుపర్కం లేకపోవడం, అనేభేదం చూశాం. మంత్రాలు 17 కావడంతో నీరాజనం ప్రత్యేక మంత్రంతో షోడశోపచారాలకు విశేషంగా కన్పిస్తుంది. చివరిదైన వందనం అనేది ధాతా పురస్తాత్ పుష్పాంజలివద్దనే పుష్పాంజలి చేసి ప్రదక్షిణ చేసి నమస్కారం చేయడంగా ఆ ఉపచారంలో కలిసి ఉన్నట్లు గుర్తించవచ్చు.

**శ్రీ సూక్తవిధానం :**

శ్రియః పంచదశర్చం. శ్రీ సూక్తంలో 15ఋక్కులే వుండడంవల్ల కొన్ని ఉపచారాలకు మంత్రాలు తగ్గుతాయి. అందుచేత శ్రీసూక్త ఫల శ్రుతిలోనించి యశ్శుచిః, పద్మప్రియే, లక్ష్మీంక్షీర మొదలైనవి తీసుకొని వాడడం జరుగుతున్నది. కొన్ని విధానాల్లో మధుపర్కం, మంత్రపుష్పం శ్రీ సూక్తం ఋక్కు లేకుండా ఇవ్వడం జరుగుతుంది. ఇది యుక్త మనిపిస్తుంది.

**మన్యుసూక్తం :**

మన్యుసూక్తంలో 14ఋక్కులే వున్నాయి. ధన్వనా గా-తో 15 చేసి శ్రీసూక్తంలా వుపయోగించడం జరుగుతున్నది. ఇక్కడ మధుపర్కం ఉండడం, లేకపోవడంవల్ల భేదాలు. విశాఖానక్షత్రమంత్రం 2 భాగాలుగా నీరాజన, మంత్ర పుష్పాలకు ఉపయోగించడం, ఇంకా వర్షంతు తే విభావరి - శ్రీ సూక్తం

